TP/A1/10B145
673

# త్రిలోచన కవిరాజు

స్వర్గీయ రవీంద్రనాథ మైత్ర
రచితం

అనువాదం
**చక్రపాణి**

ప్రకాశకులు
యువ కార్యాలయం
తెనాలి, గుంటూరుజిల్లా.
1937

శ్రీ వేమన గ్రంథాలయము,
తేలప్రోలు.

# పరిచయము

రవీంద్రుని తండ్రి ప్రియనాథమైత్ర. తల్లి ఉమాదేవి. 1896 సంవత్సరాన రంగపురంలో రవీంద్రనాథమైత్ర జన్మించాడు. రవివారంనాడు జన్మించడంవల్ల వీరి పేరు రవీంద్రనాథుడని పెట్టారు. రవీంద్రుడు చిన్నప్పటినుంచీ గొప్ప మేధావి. అక్షరాలు అన్నీ రాకముందే రామాయణం చేతబట్టి చదవటానికి మహాతంటాలు పడేవాడు. ఒత్తులు వచ్చినప్పుడు తల్లి నడిగి ఉచ్చారణ తెలుసుకొనేవాడు. ఒక్కసారి తెలుసుకొన్నది యిక మరచిపోయేవాడు కాడు — అంత జ్ఞాపకశక్తి. ఆరోయేటనే ప్రాథమిక విద్య పూర్తి చేశాడు.

మిడిల్ స్కూలులో చదివేటప్పుడు రవీంద్రుని అన్న ప్రకాశచంద్రునికి మలేరియావచ్చింది. చికిత్సకు కలకత్తా తీసుకొచ్చారు. తల్లితోపాటు రవీంద్రుడు కూడా కలకత్తా వచ్చాడు.కలకత్తా డాక్టరుల సలహా ప్రకారం గాలిమార్పుకు కుటుంబం అంతా దేవఘర్ వెళ్లింది. అక్కడ ఏడుమాసాలు వుండవలసివచ్చింది. రవీంద్రుడు దేవఘర్ హైస్కూలులో చేరాడు. స్కూలు కొత్త. కోర్సు కొత్త. సమయం స్వల్పం. అయినా క్లాసులోకల్లా ఫస్టున ప్యాసయ్యాడు. రవీంద్రుని తండ్రికి మాష్టరునిపెట్టి చదువు చెప్పించటం అంటే ఎప్పుడూ ఇష్టంఉండేదికాదు. తానే స్వయంగా తన పిల్లలకేకాక పొరుగు పిల్లలకుకూడా చెప్తుండేవాడు. తండ్రి గుణం కొడుక్కుకూడా అబ్బింది.

అనేకమంది పిల్లలకు నిస్వార్థంగా చదువు చెప్పాడు.

దేవఘర్ ఛోటానాగపూరులోని ఒక కొండ ప్రదేశం. అచ్చట ప్రకృతి దృశ్యాలు చాలా రమణీయంగా ఉంటవి. దేవఘర్‌కు చుట్టూ సంథాలు మొదలైన ఆదిమజాతులవారు నివసిస్తూవుంటారు. అచ్చటనే బాలరవీంద్రునికి ప్రకృతితో పరిచయం అయింది. ఆదిమజాతుల సంపర్కము కూడా లభించింది. తన కర్మజీవితంలో చాలాభాగం రవీంద్రుడు యీ ఆదిమజాతుల సేవకే వినియోగించాడు.

దేవఘర్‌నుండి తిరిగి రవీంద్రుడు సయ్యద్‌పూర్ వచ్చాడు. ప్రకాశచంద్రుడు యిక్కడే చనిపోయాడు. తర్వాత తండ్రి పెన్షన్ తీసుకుని ఫజల్‌పూర్ వెళ్లాడు. రవీంద్రుడు అక్కడ హైస్కూలులో చేరాడు. అప్పుడే వంగవిభజన జరిగింది విభజనకు విరుద్ధంగా బెంగాలులో అంతటా ఆందోళన జరిగింది. బాలరవీంద్రుడుకూడా చుట్టుపట్ల గ్రామాలలో యితరవిద్యార్థులను వెంటబెట్టుకొని సభలుచేసీ, ఉపన్యాసాలు యిచ్చీ, రాష్ట్రీయ గీతాలు పాడీ, తన కర్తవ్యం నెరవేర్చుకున్నాడు. అప్పటినుండే రవీంద్రుని హృదయంలో సాహిత్యప్రేమా సమాజసేవాబీజాలూ నాటుకపోయినవి.

తల్లిపేరుతో రవీంద్రుడు యువకులకు 'ఉమా గ్రంథశాల' అని ఒక గ్రంథాలయం స్థాపించాడు. ఎప్పుడూ పుస్తకాలు చదువుతూ వుండేవాడు. అతని

స్కూలు జీవితంలోనే మేఘదూత, కుమారసంభవం, భగవద్గీత, రవీంద్రనాథ టాకూరుగారి అనేక గ్రంథాలు చదివి వాటిలో చాలాభాగం కంఠస్థపరిచాడు కూడా. సంస్కృతంలో మంచి జ్ఞానంవుంది. ఒక పుస్తకంకూడా వ్రాశాడు. వీరికి ఇటాలియను ఫ్రెంచిభాషలలోకూడా ప్రవేశమున్నది.

ఫస్టుక్లాసులో మెట్రిక్యులేషన్ ప్యాసయి రవీంద్రుడు కలకత్తా వచ్చాడు. 1917 లో వంగవాసీ కాలేజీనుంచి బి. ఏ. ఆనర్సు పాసయ్యాడు. పరీక్ష అయిన తరువాతనే హరిబాలాదేవిని వివాహమాడాడు. 1918 లో తండ్రి అకస్మాత్తుగా చనిపోయాడు. మృత్యుసమయమున తండ్రిదగ్గర లేనన్న దుఃఖం రవీంద్రుని జీవితం అంతా బాధించింది. తర్వాత M. A., LL. B. చదవటానికి కలకత్తా యూనివర్సిటీలో జాయిను అయ్యాడు. ప్రిలిమినరీ పాసయాడు. ఫైనలు పూర్తికాకముందే చదువుకు స్వస్తి చెప్పి అసహాయోగ ఆందోళనలో (1920) దూకాడు.

రవీంద్రుడు రంగపూరును కార్య క్షేత్రంగా పెట్టుకుని అనేక సంవత్సరాలు పని చేశాడు. అప్పటికి రంగపూరుతో సంబంధం వదలి పది పన్నెండు సంవత్సరాలు అయింది. కాలేజీ నుంచి అప్పుడే వచ్చిన అనుభవము లేని యువకుడు. పెద్దలలో పేరు లేదు. జేబులో పైసా లేదు. అయినా రవీంద్రుని సేవ విశ్వాసము, యువకులను వశపరచుకుంది. కొన్నాళ్ల

తరువాత లోకల్ పోలిటిక్స్‌లోకూడా పాల్గొన్నాడు. చాలా కాలం రంగపూరు మునిసిపల్ కౌన్సిలరుగా ఉన్నాడు.

రవీంద్రుడు విసుగూ విరామం ఎరగడు. కాంగ్రెసు ప్రచారం, విద్యార్థులకు విద్యావసతులు, సంఘ అత్యాచారానికి బలిఅయిన స్త్రీలకుతోడ్పాటు, ఆదిమ జాతుల ఉన్నతికి ప్లానులు వేయుటం, వారిలో సంఘీభావం కలుగ జేయటం, హిందీ ప్రచారం, ఎప్పుడు చూచినా యీపనులలోనే మగ్నుడై యుండేవాడు చాలా కొద్దికాలం సాహిత్య సేవకు వినియోగించాడు. అయినా వీరి రచన చూస్తే యింత ఎప్పుడు వ్రాయ గలిగాడా అని ఆశ్చర్యం కలుగుతుంది.

రవీంద్రుని కర్మజీవితమంతా ఒక తుపానువలె గడిచింది. అతడు స్థావరంగా ఎక్కడా వుండలేదు. రంగపూరులో కొన్నాళ్లు పనిచేసిన తరువాత ఆదిమ జాతుల సమస్య తలపెట్టాడు. రంగపూరు నుంచి కార్య క్షేత్రం సంతాల్ పరగణాకు మార్చాడు. అక్కడ సంతాల్, ఒరావ్ జాతులకు చాలా సేవ చేశాడు. వీరిలో చాలామంది మిషనరీలవల్ల క్రైస్తవులయ్యారు. రవీంద్రుడు వీరిలో చాలామందిని మరల హిందూమతంలోకి మార్చాడు. వాళ్లభాష 'కృఖ్' నేర్చుకున్నాడు. ఆభాషలో మతగ్రంథంకూడా ఒకటి వ్రాయాలనుకున్నాడు, కాని వీరి కోరికను మృత్యువు

నెరవేరనీయ లేదు.

కలకత్తాలో విద్యార్థిగా వుంటున్నప్పుడు సుప్రసిద్ధ వంగనాటక కారుడు, స్వర్గీయ ద్విజేంద్రలాల్ రాయ్ గారితో వీరికి పరిచయం కలిగింది. రాయిగారు వీరి ప్రతిభ చూచి వీరిని చాలా ప్రోత్సహించారు. ఆ రోజులలో వీరు రచించిన హామీరూ, మొదలగు నాటకాలలో రాయిగారి ప్రభావం స్పష్టంగా కన్పిస్తూ వుంది.

రంగపూరులో వుండేటప్పుడే వీరు 'ఆనందబజారు' 'శనివారేర చిఠీ' మొదలగు పత్రికలలో వ్రాస్తూ వుండేవారు. రంగపూరు మునిసిపల్, డిస్ట్రిక్టుబోర్డు ఎన్నికలప్పుడు రంగపూరునుండి 'వార్త' అనే పత్రికను కూడా ఒకదాన్ని నడిపారు.

రవీంద్రుని ప్రతిభ సర్వతోముఖమైనది. నవలలు, నాటకాలు, కవిత్వము, కథలు, వ్యంగ్యము, హాస్యము-అన్నీ వ్రాశాడు; సాఫల్యాం పొందాడు. వీరు వ్రాసిన నాటకాలన్నీ స్టేజీకిపనికివచ్చేవే. 'మానమయీగరల్ స్కూల్' అనే నాటకము టాకీగా కూడా తీశారు. కలకత్తాలో ఈఫిల్ము వరుసగా 22 వారములు నడిచింది.

రవీంద్రుని రచనలో ఏదో ఒక విధమైన ఓజస్సు మనకు కనిపిస్తుంది. సాహిత్యం వ్రాయటానికి అవసరమైనవన్నీ వీరికి లభించినవి. ప్రకృతి పరిచయం, సాధారణ జనసంపర్కం, పల్లెటూళ్ళ అనుభవం బాగా

కలిగింది. ఆదిమ జాతులతో వుంటంవల్ల ఆదిమ మానవుని— నాగరికతాడంబరమును ఎరుగని మానవుని— బాగా స్టడీచేయటానికి అవకాశం దొరికింది. నాగరికతా దృష్టితో చూస్తే ఆదిమ జాతులు ఇతర జాతులకంటే చాలా వెనుకపడి వుండవచ్చును గాని మానవుడు-ప్రకృతి, సంబంధాన్నిగురించి చర్చించే వరకు ప్రపంచంలోని అన్నిజాతులకంటే ఆదిమ జాతులే అగ్రస్థానం వహిస్తవి.

రవీంద్రుడు తన పాత్రలతో లీనమైపోతాడు. పాత్రలను సృష్టించేటప్పుడు తనవ్యక్తిత్వాన్నివాటిలో ఐక్యం చేస్తాడు. తన కథలు మిత్రులకు చదివి వినపించేటప్పుడు పాత్రల కష్టాలకు కళ్ళవెంట నీళ్లు కార్చేవాడట. పాత్రలతో వీరికున్న యీ ఐక్యతే పాత్రల వ్యక్తిత్వానికి ప్రాణం పోస్తున్నది.

ఏసాహిత్యంలోనైనాకానీ, హాస్యరచనలలోని పాత్రలుచాలా కాల్పనికంగా వుంటవి-స్వాభావికత్వం వుండదు. రవీంద్రుని పాత్రలలో యీ దోషము బొత్తుగా లేదనటానికి వీలులేదుకాని చాలాభాగం సహజంగానే వుంటవి. అచ్చటచ్చట పాత్రల చిత్రణ మనలనుండే చేశాడా అన్నట్లువుంటుంది. ఇదే రవీంద్రుని కళాసాఫల్యానికి ప్రమాణము.

# త్రిలోచన కవిరాజు

నాకు మరోశబ్దమేదీ వినిపించటంలేదు. నాకాళ్ళనున్న పాదుకలకూ, ఫుట్‌పాత్‌కూ ఘర్షణవల్ల పుట్టిన టకటక కటకట శబ్దంమాత్రం నానా విధలయలతో మేళవించి నా కర్ణకుహరాల్లో ప్రవేశిస్తోంది. అదే వింటో వింటో నా మనస్సు వికలమైపోయింది. జీవితం వ్యర్థంగా తోచసాగింది. ఉదయం 'జాట్సు రెస్టారెంట్ డిలక్సు' లో కప్పు కానీచేసి తీసుకున్న టీ-మూడు రోజులనాటి మాడిపోయిన టోస్టూ-ఉండుండి అవే తేపుకు వస్తున్నవి. ఇవ్వాళ పగలంతా యింటికి తిరిగి రాకూడదని సంకల్పించుకొని బయలుదేరాను; కాని ఎక్కడ గడుపుదామా అనేది నిర్ణయించుకోలేకపోయాను. నాకు పరిచితులయిన ఒక రిద్దరి స్నేహితుల యిళ్లు సమీపంలోనే వున్నాయి. అక్కడకు పోవచ్చును కూడా. ఎందుకనో అక్కడకు పోవటానికి నాకు మనస్కరించలేదు. బజారునుంచి వెచ్చం తెచ్చుకొంటున్న వకరిద్దరు దాసీలు నా ప్రక్కగానే వెళ్ళిపోయారు; వాళ్ళవంక నేను కన్నెత్తి కూడా చూడలేదు. అనుక్షణమూ ప్రపంచమంటే వీతరాగిని కాసాగాను. ఈ ప్రపంచమంతా వోక సంతఅయినా శ్మశానమయినా నా ఆటంక మేమీ వుండదు.

పోతూ పోతూ వుండగా ఒక యింట్లో అకస్మాత్తుగా పురుషుల క్రందనధ్వని వినపడింది. నేను అక్కడే

ఆగిపోయి కిటికీగుండా చూచాను. ఇంట్లో చాలా మంది పురుషులు వున్నారు. కొందరు ఏడుస్తున్నారు. కొందరు కళ్ళు తుడుచుకొంటున్నారు. వాకిట్లో పాడె గానీ, అనంతశయనం కానీ లేదు. పైవంక చూచాను. పైకప్పు యింకా కొసనుంచి ఆ కొసవరకు పెద్ద సైను బోర్డు కట్టివుంది. దానిమీద గిల్టు అక్షరాలతో యిలా వ్రాసివుంది—

## ప్రేమార్తి హరణ ఔషధాలయము

త్రిలోచన కవిరాజు •

ఈ ఔషధాలయమూ, కవిరాజూ కొత్తగా కనిపించటంవల్ల ఏమిటో తెలుసుకుందామను కుతూహలంతో ఆగిపోయాను. కాని మరుక్షణానే ఔషధాలయం కానీ కవిరాజు కానీ కొత్తవారు కారని గ్రహించాను. ఎందుకనంటే సైనుబోర్డుమీద గిల్టు అక్షరాలు బాగా నల్లబడిపోయినై. ఇంతేకాక రోగులు వేచివుండే గదికి ప్రక్క హాల్లోవున్న ఫర్నిచరు, నాకు కనపడుతున్నంతవరకు, పాతదిగానే వున్నది. క్రింద పరిచిన తివాసీకూడా సిరామరకలతోనూ నూనెడాగులతోనూ నిండివున్నది. గల్లాముందు కూర్చున్న వృద్ధుడు కూడా కొత్తవాడుగా కనపడలేదు. ఇది కవిరాజుగారి డిస్పెన్సరీ అని అప్పుడు గ్రహించాను. గల్లా ముందు కూర్చున్న వృద్ధుడు నన్ను తదేక ధ్యానంతో చూస్తూ అన్నాడు—"దయచేయండి, లోపలికి దయ

చేయండి."

లోపలికిపోయి తివాసీమీద కూర్చున్నాను. గోడ మీద మదన దహనశైల చిత్రం ఒకటి వున్నది అదే చూస్తూవుండగా ఆ మహాశయుడు అన్నాడు– "తెలుసండీ, ఇక్కడ రోగనిదానం చేయించుకొన్నం దుకు ఫీజు ఎనిమిది రూపాయలు యివ్వాలి."

"ఫీజు ఎవరికి?" నేను అడిగాను.

"కవిరాజుగారి ఫీజు. తమ వ్యాధి తప్పకుండా మూడు రోజులలో సమూలంగా నాశన మవుతుంది. కవిరాజు సాక్షాత్తూ ధన్వంతరి."

నేను విరక్తుడనై అన్నాను—"ఇది చెప్పటాని కేనా తమరు పిలిచింది! నాకు రోగం రాగం ఏదీ లేదు!"

వృద్ధుడన్నాడు— "తప్పకుండా వుంది. ఈరోగం లేని స్త్రీపురుషు లెవ్వరూ లేరు. రాజా మహారాజాల దగ్గరనుంచి—"

నే నతనిమాట పూర్తి కానివ్వ లేదు. మధ్యనే వ్యంగ్యంగా అన్నాను — "తమరు అంతర్యామి లాగున్నారే!"

వృద్ధు డలాగే శాంతంగా అన్నాడు—"చిత్తము. అలా అనుకొన్నా పొరపాటేమీ వుండదండి. మహా శయా! ఇప్పుడు నాకు అరవైమూడో వసంతం గడు స్తూవుంది. గత పద్దెనిమిది సంవత్సరాలనుంచి కవి రాజుగారి దగ్గర కంపౌండరీ చేస్తున్నాను. సగటున

రోజుకు మూడువందల మందికి మందు లిస్తూవుంటాను. వసంత రుతువులోనూ వర్షా కాలంలోనూ రోగుల సంఖ్య రెట్టింపవుతుంది. ముప్పైమంది పిల్ల కాయలకు పొట్లాలు కట్టటానికి పూపిరి ఆడదు. నా అనుభవంమీాద తెలుసుకున్నది తమకు చెప్పుతున్నాను—కవిరాజుగారి ఔషధం తీసుకోంది ఎవ్వరికీ జరగదు ! తమ రేం—"

నేను కొంచెం ఆశ్చర్యంతో అడిగాను—"మీారు ఏజబ్బుసంగతి చెప్పేదీ తెలిస్తే—"

వృద్ధు డన్నాడు— "తమరు సైనుబోర్డు చూడలేదావేంటి? యావత్తు ప్రణయజనిత వ్యాధులకు, ఔషధం ద్వారాగానీ, ముష్టియోగంవల్లగానీ చికిత్సచేస్తారు. ఫీజు ఎనిమిదిరూపాయలు—మందు ఉచితం ! ఇంతకంటె మీాకు మంచి సౌకర్యం ఎక్కడ దొరుకుతుంది ! "

తల తిప్పూ, గుండెదడా, మొదలగు ప్రణయ జనిత వ్యాధులపేర్లూ, వాటికి రకరకాల పేటెంటు ఔషధాలూ— పెద్దపెద్ద మాసపత్రికలలోనూ దిన పత్రికలలోనూ ప్రకటింపబడుతూ వుంటం నా చిన్న తనంనుంచి చూస్తూ వస్తున్నాను. కాని వాటి అవు సరం నాకెప్పుడూ కలగలేదు. ఇవ్వాళ యీా వృద్ధుడు—ఆలోచిస్తున్నాను.

వృద్ధుడన్నాడు — "ఏమిటి ఆలోచిస్తున్నారు? తమకేమీా రోగంలేదని భావిస్తున్నట్టుగా వున్నదే !

కవిరాజుగారి ఎదుట పడగానే తమకు రోగమున్నదీ లేనిదీ తెలిసిపోతుంది. మహాశయా! ఇప్పుడు తమ ప్రాయం కూడా ఎంత? నన్ను చూడండి, నా పేరు బలరామరసనిధి. అయిదుగురు స్త్రీల అస్థు లిదివరకే గంగలో కలిపాను. ఈ అరవైమూడో యేటకూడా కవిరాజుగారి దగ్గరనుంచి ప్రిస్క్రిప్షన్ రాయించుకో వలసివుంటూవుంటుంది. "

నేను ఎదురు చెప్పలేకపోయాను. ఈవ్యాధి నాకూడా వున్నట్టు తోచసాగింది. భార్యతో పోట్లాడి వచ్చినప్పటినుంచి నా తల చిటపటలాడుతూ వుంది. ఇదికూడా ఏదో ప్రణయసంబంధమైన వ్యాధే కావచ్చునని భావించాను. ఇది ఏజబ్బో అడిగి తెలుసుకోవాలను కొంటూవుండగా రసనిధి మహాశయుడు ఆదుర్దాగా అన్నాడు— " ఇదుగో! కవిరాజుగారు వచ్చేశారు ! "

మరుక్షణం హుక్కా చేతపట్టుకొని, మోహ ముద్గరం వల్లిస్తూ త్రిలోచన కవిరాజుగారు గదిలో ప్రవేశించారు. వయస్సు డెబ్బదికి దాటివుంటుంది. మాడుమీద వెంట్రుకలు బొత్తిగా లేవు. వెనకవున్న నాలుగు వెంట్రుకలు జనపనార పీచువలె తెల్లగా వున్నాయి. వాటిచివర వుమ్మెత్తపూవు కట్టివుంది. కవిరాజుగారి లలాటంమీద, పగటిభాగవతులు శివుని వేషంలో పెట్టుకున్నట్టుగా, ఒక కన్నూ—దాని మధ్యను అక్షితారకా చిత్రించివుంది.

తివాసీ మీద కూర్చోగానే కవిరాజుగారు ముందు నావంక చూశారు. ఎందుకో తెలియదు. నాకళ్లు వాటంతటవే మూతపడ్డవి. కవిరాజుగారు నన్ను చూచి ఓదార్పుగా అన్నారు "భయం లేదు. ఆరోగ్యం కలుగుతుందిలే". తర్వాత హుక్కా ఒక్క పీల్పు పీల్చి కేకవేశారు—"రోగులను తీసుకురా, మాధాయి."

పిలుపువిని కొందరు బాలశిష్యులు హాజరయి కవిరాజుగారికి నమస్కారం చేసి రోగులున్న గదిలోకి వెళ్ళారు. నేను తివాసీమీదనుంచి లేచి ఒక మూలగా వున్న ముక్కాలి పీటమీద కూర్చుని రోగులున్న గదివైపు లోలుపనేత్రాలతో చూడసాగాను.

రోగులున్నగదిలో నుంచి నానావిధ గుంజనాలూ, దీర్ఘశ్వాసలూ, స్ఫుట, అస్ఫుట రోదనాలూ విని పిస్తున్నాయి. తర్వాత కవిరాజుగారి శిష్యుల భుజాల మీద చేతులు మోపి రోగులు హాల్లోకి రా మొద లెట్టారు.

ఇదేమిటి! దాదాపు అందరూ నేను ఎరిగిన వారే! రసనిధిగారు చెప్పినదానిలో పీసం కూడా అబద్ధంలేదు. రాజకీయ నాయకులదగ్గరనుంచి మాస పత్రికల సంపాదకుల వరకు అన్నితరగతుల వ్యక్తులూ చికిత్సకోసం వచ్చారు. ఇందులో విశేష మేమంటే అందరూ ఏడ్చేవారే. కాని ఒకరివంక ఒకరు మాత్రం చూచుకోడం లేదు. జబ్బు చూపించుకోవడానికి

వచ్చినవారిలో పండు వృద్ధులదగ్గరనుంచి పది సంవత్సరాల పిల్లలవరకూ ఉన్నారు. నామనస్సులో ఒక ప్రశ్న కలిగింది. రసనిధిమహాశయుని వద్దకు వెళ్లి చెవిలో అడిగాను. వారన్నారు—"ఆఁ, స్త్రీలుకూడా వున్నారు—కాని రెండో అంతస్తులో. వీరిని పంపిన తర్వాత వారిని చూస్తారు."

కవిరాజుగారు కేకవేశారు — "ముందు పిల్లలను హాజరు పెట్టు"

ఒక్కమాటే అయిదారుగురు స్కూలుపిల్లలు కళ్ళుతుడుచుకొంటూ తుడుచుకొంటూ వచ్చి తివాసీ మీద కూర్చున్నారు. కవిరాజుగారు గంభీరస్వరంతో ప్రశ్నించారు—"పరీక్ష తప్పారా?"

అందరు—తాళంతప్పకుండా వెక్కి వెక్కి ఏడుస్తూ జవాబిచ్చారు—"ఊఁ."

కవిరాజుగారు యింకేమీ అడగలేదు. రసనిధి వైపు చూచి చెప్పారు—"ఉదయం 'మోహముద్గర గుటిక' ఒక మాత్ర. పథ్యం ఉపవాసం."

ఫీజు దాఖలుచేసి మందు తీసికొని విద్యార్థులు వెళ్లిపోయారు.

తర్వాత యుక్తవయస్కులు రాసాగారు. మొదట వచ్చినవారిని నేను ఎరగను. వారు కవిరాజుగారి ముందు కూర్చుని భోరున ఏడ్చారు.

కవిరాజుగారు ప్రశ్నించారు—"వృత్తి ఏమిటి?"

వారు ఏడుస్తూనే జవాబిచ్చారు — "పత్రికా

సంపాదకత్వం!"

"హుఁ! కవిత్వం ప్రకటించావా?"

"చిత్తం, దానిమూలానే—"

"హుఁ! కవయిత్రికి ప్రత్తరం వ్రాశావా ?

"చిత్తం, జవాబు చూచినతర్వాతనే—" అంటూనే సంపాదకుడు ఆవురున ఏడ్చాడు.

కవిరాజుగారి పొలిపోవని నిదానము చూచి నేను ఆశ్చర్యపడ్డాను! కవిరాజుగారు రోగినాడిచూచి రసనిధితో చెప్పారు — ఉదయం, సాయంత్రం 'అశ్రుభైరవవటి' మధ్యాహ్నం స్వల్పంగా 'ప్రణయాంతకం' " తర్వాత సంపాదకునివంక చూచి అన్నారు—"పత్రికా సంపాదకత్వం వదిలేసేయి."

ఈసమయంలో సన్నని ఆర్తనాదం ఒకటి విన్నాను. మరుక్షణంలోనే మాధాయి వచ్చి, రెండో అంతస్తులో ఒకరోగిణి మూర్ఛపోయిందని చెప్పాడు. కవిరాజుగారు లేచారు. ఒకచిటికెడు నస్యం తీసి నాసికాపుటాల్లో కుక్కుకొంటూ కుక్కుకొంటూ పై అంతస్తుకు వెళ్ళారు. నేనీఖాళీలో రసనిధి మహాశయునివద్దకు వెళ్లి అన్నాను—"తమరు వేరుగ భావించకపోతే—"

రసనిధి అన్నాడు— "అలా ఎప్పటికీ భావించను. తమకు కావలసింది ఏదో అడగండి."

కవిరాజుగారి వృత్తాంతము తెలుసుకోవాలని నా మనస్సు తహతహ లాడుతూ వుంది. అడిగాను—

"తమరు కవిరాజుగారిని చాలారోజుల్నుంచి ఎరుగుదురు. వారి విషయం—"

రసనిధి ఆశ్చర్యంతో అన్నాడు— "కవిరాజుగారి చరిత్ర తెలియదూ మీకు? అలాగయితే క్లుప్తంగా చెప్తాను వినండి.— యాభై సంవత్సరాల క్రితం సంగతి. అప్పుడు కవిరాజుగారు సిద్ధాంత కౌముదీ మేము ముగ్ధబోధా చదువు తున్నాము. హఠాత్తుగా ఒకరోజున గ్రామంలోవుండే రజక నందిని ధైర్యమయి, త్రిలోచనబాబు తన కొంగు తాకాడని ఆచార్యులవారి దగ్గర ఫిర్యాదు చేసింది. ఆచార్యుల వారు నిండా కోపించి వీరిని చతుష్పాఠిశ్రేణి నుంచి వెళ్లకొట్టారు. ఆ క్షణానే త్రిలోచనబాబు సంసారాన్ని త్యజించి, ఆ దేశమూ ఈ దేశమూ తిరిగి జగత్తులో ప్రేమ వ్యాధే అన్నిటి కంటే ప్రాణాంతక మైనదని గ్రహించారు. అప్పుడు జీవ హితం కోసం ఔషధం వెదుకుతూ వెదుకుతూ చిన్నగా హిమాలయం వెళ్ళారు. అక్కడ సిద్ధులైన మదనమథనస్వామిని ఆశ్రయించి, వారి దగ్గర దీక్ష పొందారు. వారే వీరి ప్రేమ వ్యాధిని పోగొట్టారు. తదుపరి గురువుగారి ఆదేశానుసారం — లోకహితం కోసం —గురు ప్రదత్తమైన మూలికలు తీసుకుని, మరల ప్రపంచంలోకి వచ్చి యీ డిస్పెన్సరీ తెరచారు. వీరి శిష్యులెవ్వరూ పెళ్లిచేసుకో కూడదనే నియమ మొకటున్నది; నాకు మాత్రం — నాపైతృకవృత్తి యిదే కావడంవల్ల—ఆ

నిబంధన తొలగించారు. కవిరాజుగారి కృపవల్ల కానీండి, నా అదృష్టంవల్ల కానీండి—ఇప్పటికి అయిదుగురు స్త్రీల చేతుల్లోంచి ఉద్ధరింప బడ్డాను. హేగురు, మీరే తారకం!" అని రసనిధి రెండు చేతులూ ఎత్తి కవిరాజుగారి నుద్దేశించి నమస్కరించాడు.

ఈ సమయంలో కవిరాజుగారు మరల వచ్చి తివాసీమీద కూర్చున్నారు. ఈ తఫా నేనుకూడా భక్తితో కవిరాజుగారి పాదధూళి తీసుకున్నాను. కవిరాజుగారు నా తల స్పృశించి ఆశీర్వదించారు.

రోగులింకా యేడుస్తూనే ఉన్నారు. కవిరాజుగారు గద్దించారు—"ఖామోష్ !" క్రిందనధ్వని ఆగిపోయింది. ఇంకా ఎక్కిళ్లూ ముక్కుళ్లూ మాత్రం వినపడుతున్నై.

రెండవ రోగివచ్చి కూర్చున్నాడు. వయస్సు పాతిక సంవత్సరా లుంటుంది. వొంటిమీద గులాబి రంగు పంజాబు·లాల్చీ వుంది. పడ్వాటం మూలాన కళ్లు ఎర్రగా వున్నయి. క్రాపు చిక్కురు బొక్కురుగా లేగి వుంది.

తివాసీ మీద కూర్చోగానే నాలుగు బారల నిట్టూర్పొకటి విడిచాడు. కవిరాజుగారి తెరచివున్న పొడుము·డబ్బా నుంచి కొంచెం నస్యం ఎగిరి క్రింద పడింది. కవిరాజుగారు యిది గమనించారు. తర్వాత చేయిచాచి రోగి నాడి చూచి అడిగారు—"రోగ వివ

రాలు చెప్పా?"

పక్కయింటి పిట్టగోడమీద ఆరవేసిన చీరె చూచి మొదట ఇతనికి ఏవిధంగా రోగముత్పన్నమైందీ, తర్వాత క్రమంగా అనిద్రా, అరుచీ దీర్ఘశ్వాసలూ—మొదలగు యితర లక్షణాలు (symptoms) ఎలా కనపడిందీ—అతను వర్ణించాడు. ఆఖరుకు నిన్న సాయంత్రం ఆ చీరె ఆవిడ మిద్దె నుంచి కూరగాయ తొక్కలు యితని నెత్తిమీద పడవేసినందువల్ల ఇంకా చాలాలక్షణాలు పుట్టుకొచ్చినవని చెప్పి జేబులోనుంచి అరటికాయ తోలుతీసి కవిరాజుగారికి చూపిస్తో చెప్పసాగాడు—

"ఆమె స్మృతి చిహ్నం అట్టేపెట్టాను— ఇది తోలుకాదు—పూలు!"

కవిరాజుగారు అతని చేతినుంచి తోలు తీసుకొని పరీక్షించి—ప్రశ్నించారు—"హుఁ! నిన్ను యీ జుర్ఘాటంలో యిఱికించి నావిడప్రాయం ఎంత?"

రోగి చీత్కారంచేశాడు— "పదహారు! — పదహారు!— sweet six—"

కవిరాజుగారు గద్దించారు— "ఖామోష్! — మందు, ఉదయం 'కిశోరీకాలానలం' లోపలకు, సాయంత్రం 'దీర్ఘశ్వాసారి ఘృతం' రొమ్ముమీద పూతకు. పో, దక్షిణంవైపు కిటికీమీద మందపు పరదా వొకటి వేయి."

తర్వాత చాలామంది రోగులు వచ్చారు. ఇం

దులో ఆశ్చర్యమేమంటే—అందరూ సంకోచం లేకుండా అందరి యెదుట గూఢవిషయాలను కూడా వెల్లడిస్తున్నారు. అణుమాత్రం సిగ్గుకూడా ఎవ్వరూ పడటం లేదు. వృద్ధ అనుకూల చక్రవర్తిని నేను ఎరుగుదును. అతనికీ అతని నాలుగో సంబంధం భార్యకీ కలవక పోవటంచేత, ప్రస్తుతం పొరుగింటి విశ్వంభరబాబు ప్రౌఢపత్నిని చూచి రోగగ్రస్తు డయ్యాడు. ఇటు విశ్వంభరబాబు కూడా అనుకూలబాబు నాలుగో భార్యను కాస్త తీర్థాటనం చేయించుకు రావాలని సంకల్పించు కున్నాడు. ఈ సంకల్పానికి ఫలితంగా అతనికి శిరోపీడా, అరుచీ—ఆదిలక్షణాలు కనపడ సాగినవి. ఈ యిద్దరూ తమ తమ రోగాలనూ, కుటుంబ రహస్యాలనూ, ఒకరి ఎదుట ఒకరు చెప్పారు. లవలేశంకూడా వారు సంకోచించలేదు. త్రిలోచన కవిరాజుగారిలో వున్న ఆధ్యాత్మిక శక్తిని చూచి, నాకు వారియెడల భక్తి మరీ ఎక్కువ కాసాగింది.

ఒకరి తర్వాత ఒకరు రోగులు వస్తున్నారు; మందు తీసు కొంటున్నారు; పోతున్నారు. కాస్త కూడా విరామం లేదు. ఇటు వేళకూడా చాలా మిగిలి పోయింది.

నేను లేవాలనుకొంటూ వుండగా, తుపానువలె ఒక వ్యక్తి గదిలోకి పరుగెత్తుకొచ్చి చీత్కారం చేశాడు—"ప్రాణాలు పోతున్నాయి! పోతున్నాయి!!"

నేను భయంతో రోమాంచితుడ నయాను. అరే!

ఇతడు వాస్తవిక సమితి అనన్యతమ సభ్యుడు రాతులరాహాయే! రాహామహాశయుడు స్వప్న రాజ్యంలోంచి వాస్తవిక ప్రపంచంలోకి ఎలా వచ్చాడు?... గదిలోవున్న వాళ్ళంతా స్తబ్ధులయారు ఒక్కక్షణంక్రింద మూల్గుతూ మూలుగుతూ దీర్ఘ శ్వాసలు విడుస్తూవున్న రోగులంతా కొత్త రోగి స్థితిని చూసి, కౌతూహలంవల్ల కావచ్చు—శ్వాస పీల్చడమే మరిచిపోయారు. కవిరాజుగారు ఒకమాటు రాహావంక చూచారు. తర్వాత లేచి అల్మారీనుంచి బిల్వకాస్టప్టు స్టెతిస్కోపు తీసుకువచ్చి రాహా హృదయంమీద పెట్టారు.

రోగి చీత్కారం చేశాడు— "బాధ! బాధ! హృదయం జల్లెడయిపోయింది, కవిరాజుగారూ, జల్లెడ!"

కవిరాజుగారు గద్దించారు. రోగి స్తబ్ధుడయాడు. నాడిచూచి కవిరాజుగారు అన్నారు— "హుఁ! రోగం కష్టసాధ్యము."

రాహా హతాశుడై అడిగాడు—"నయమవుతుందా? లేక పుర్రె త్రాడు—"

కవిరాజుగారు దిలాసాయిస్తూ అన్నారు—"ఏమీ భయంలేదు. ముందు, సంగతేమిటో చెప్పు."

రోగి అన్నాడు—"ఇంకా ఏమి సంగతి కవిరాజు గారూ! హృదయం ఆగిపోటానికి సిద్ధంగావుంది."

కవిరాజుగారు కళ్ళు మూసుకొని అన్నారు—

"హుఁ! చెప్పుకు పద."

రాహా చెప్పసాగాడు—"ప్రేమ నా హృదయంలో గూడు కట్టుకుంది — చిన్నప్పటినుంచీ! ఆ గూటి నుంచి, వందలకొలది ప్రేమ పక్షులు—గ్రుడ్లు పగల గొట్టుకొని బయటపడ్డై. ప్రపంచమంతా తిరిగి మళ్లీ అవిప్పుడు హృదయ పంజరంలోకి రావాలని చూస్తు న్నాయి; కాని చోటులేదు! చోటులేదు!—లేదు!"

బొమలు చిట్లించి కవిరాజుగారు అడిగారు— "స్పష్టంగా చెప్పు"

తర్వాత రాహా చెప్పినదానికి భావార్థమిది:— ఇతను ఒకరి తర్వాత ఒకరి చొప్పున పందొమ్మిది మంది కుమారికలకు తన ప్రేమ నివేదించాడు. ఆ నివేదితల గార్డియన్లు రాహా మహాశయుని అడ్రసు తెలుసుకొని, వాస్తవిక సమితినుండి వీరిని పట్టుకు వచ్చి ఆ కుమారికల ప్రేమార్ఘ్యము స్వీకరించమని వత్తిడిచేయ నారంభించారు! రాహా తలిదండ్రులకు యీ సంగతి తెలిసి చాలా వ్యాకులపడ్డారు. 'రాహా ముత్తాత ఒక్క సంవత్సరంలో యిరవైయొక్క వివా హాలు చేసుకొని, ప్రచురధనంతోపాటు యథోచిత మర్యాదకూడా పొందా'డని ఘటకులు చెప్తూను న్నారు. ఇది విని పురోహితులు వుబ్బితబ్బిబ్బై దగ్గ రలో సుతహిబుకయోగం ఏదన్నా వున్నదేమోనని పంచాంగాలు తిరగవేస్తున్నారు.

కవిరాజుగారు కొంచెంసేపు ధ్యానమగ్నులై

అన్నారు—"రోగం జటిలమైనది. దీనికి నియమంగా చికిత్స జరగాలి." తర్వాత కళ్ళుమూసుకొని ప్రిస్క్రిప్షన్ చెప్పారు—"ఉదయం 'బృహత్ ప్రేమాంకుశలౌహం' నిండుమాత్ర; 'పురోహిత నిసూదనవటి' అరమాత్ర; మధ్యాహ్నం 'వివాహ విద్రావణ రసం' సాయంత్రం 'ఘటకాశనీ' 'ఖట్వాంగావలేహము'—పథ్యం మొదటి మూడురోజులూ లంఖణం—తర్వాత జబ్బునుబట్టి."

ప్రిస్క్రిప్షన్ ప్రకారం మందు తీసుకొని రాహో బయలు దేరాడు. నేను అతని స్థితిగతులు కనుక్కుందామనే వుద్దేశముతో, పోవటానికి లేచి నిలబడ్డాను. కవిరాజుగారు వెనకనుంచి కేకవేశారు—"కొంచెం ఆగు!" తిరిగి చూశాను. కవిరాజుగారు మరలఅన్నారు—"నీతో కాస్త పనివుంది."

నేను కూర్చున్నాను. రోగులంతా వెళ్ళిపోయాక కవిరాజుగారు నాతో అన్నారు—"నిన్ను చూట్టం యిదే ప్రథమం, కాని ఎందువల్లనో నీవంటే నాకు కొంచెం మమకారం కలుగుతూవుంది. బహుశ నీలో యీజబ్బు లేనికారణంవల్లనే కావచ్చు. బుద్ధిమంతులూ, ఖ్యాతివంతులూ, విద్యావంతులూ, ధనికులూ, దరిద్రులూ—ఎవ్వరుకూడా యీప్రేమవ్యాధిపాశాలనుంచి తప్పించుకోలేకుండా వున్నారు. ఇది నీవిప్పుడు స్వయంగా చూచావు. ఈపట్టణంలో చికిత్సాలయం పెట్టకపోతే వీరిగతి ఏమయ్యేదో నేను వూహించ

లేకుండావున్నాను. యౌవనారంభంలో నన్ను యీ వ్యాధి మహాభయంకరంగా పీడించింది. గురు దీక్ష పొంది తరించాను. మీరు ప్రవాసీకథలూ కవిత్వాలూ చదువుతూవుంటే, ఇప్పుడుకూడా ఒకటి రెండు రోగ లక్షణాలు కనిపిస్తాయి. అందువల్ల అవి చదవటం బొత్తిగా మానేశాను. నేను ఎంతగా ప్రయత్నిస్తున్నా యీ భయంకరమైన అంటువ్యాధి నలువైపులా వ్యాపిస్తోంది. ఇది విచారకరమేకాదు—విచారణీయ ముకూడా. పుష్టికరమైన ఆహారం దొరకనందువల్ల మీరంతా దుర్బలులై పోతున్నారు. రోగం యింత త్వరగా ఆక్రమించటానికి యిదికూడా ఒక కారణం కావచ్చు. పూర్వం కంఠాశ్లేషం మినహా యీ వ్యాధి వచ్చేదికాదు. ఇప్పుడో కటాక్షమే చాలు! ఇక స్కూలూ కాలేజీలనుంచి చీరచెరగులూ తాళపు చెవులు గుత్తులవరకు యీ రోగ కీటాణువులను వెద జల్లుతున్నాయి. భవిష్యత్తులో కేవలం పదధ్వని వింటేనే మీకు మూర్ఛ రావచ్చు."

సిగ్గుచే నాముఖం కందిపోయింది. జేబులో డబ్బు లేనప్పుడు భార్య పదధ్వనివింటే నాక్కూడా మూర్ఛ వచ్చే పర్యంత మవుతుంది. కాని యీమాట కవి రాజుగారితో చెప్పలేకపోయాను.

కవిరాజుగారు అన్నారు—"సరే, నీవిక పోవ చ్చును. ఇంతవరకూ నీవు రోగగ్రస్తుడవు కానందుకు నాకు చాలా సంతోషంగా వుంది. కాని యీ వ్యాధి

సంకుల నగరంలో—ఆడపిల్లలను స్కూళ్ళకు తీసుకెళ్ళే బస్సులు మొదలుకొని, సినిమా పోస్టర్లవరకు— ఈ అపాయకరమైన రోగ కీటాణువులను వెదజల్లుతూ వుంటే నీవు మాత్రం రోగగ్రస్తుడవు కాకుండా యింకెన్నాళ్లు వుండగలవు? జాగర్తగా ప్రశ్నించను వల్ల నష్టం వుండదు. ఈ రోగానికి విరుగుడు (antidote)గా 'మదన మర్దనవటి' 'కటాక్షారి అంజనం' ఇస్తున్నాను; తీసుకుపో. వారానికి ఒకమాటు చన్నీళ్ల అనుపానంతో మదనమర్దనవటి వేసుకో. ప్రతి రోజూ వుదయం ముఖం కడుక్కోగానే కనురెప్పలకు కటాక్షారి అంజనం రాసుకో. నేను యింకా ఎక్కువసేపు వుండటానికి వీల్లేదు. పైన రోగిణులు నాకోసం ఎదురు చూస్తూ వుంటారు."

నేను నమస్కారం చేశాను. త్రిలోచన కవిరాజు గారు పునః మోహముద్గరం వల్లిస్తూ పైకి పోయారు.

నేను బయటకి వచ్చి పెద్దపెద్ద అంగలేసుకుంటూ తిన్నగా గంగవొడ్డుకు వెళ్ళాను. పుడిసెడు గంగా జలం తీసుకొని కవిరాజుగారిచ్చిన మాత్రి ఒక్కటి గొంతులో వేసుకున్నాను. గొంతు దిగిందో లేదో స్త్రీలద్వారా (infection) ఉత్పన్నమయ్యే రోగాలన్నీ దూరమైయాయి! భార్యను మరచి పోయాను. ఈ జగత్తులో నేను ఏకాకిగా వున్నట్టు నాకు తోచ సాగింది. నాకు ఎవ్వరూ లేరు!—ఎవ్వరూ లేరు!! లేరు!!!

ఎదుట భాగీరథి కిలకిల నవ్వుతూ ప్రవహిస్తోంది.

# ఆల్ స్టార్ ట్రాజెడీ

"అయితే మీరు చెప్పేది పోలా నెగ్రీ పతివ్రత కాదనేగా?" అంటూ చటక్ అకస్మాత్తుగా యింట్లోకి వచ్చాడు.

ఒక్కసారిగా అందరు ఉలిక్కిపడ్డారు. సర్వేశ్వర రావుగారి కళ్ళజోడు ముక్కుకొనవరకు జారివచ్చింది. ఒక్క క్షణం క్రిందట గోలచేసేవారంతా నోరు మూసుకు కూర్చున్నారు.... •

'చటక్ తనప్రశ్నను రెట్టిస్తూ నడుముపైన చేతులు వేసుకొని మేకువలె నిలబడ్డాడు.

అసలుసంగతి యిది. చాలా రోజులనుండి గోడల మీద పెద్దపెద్ద పోస్టర్లూ, పత్రికలలో ప్రకటనలూ చూస్తూ విహ్వాలులయి, పేటలోవున్న ముసలివాళ్లు నెత్తిన ముసుకు వేసుకొనీ, పడుచువాళ్లు సిగరెట్లు తగలేసుకొంటూ, క్రిందటి రాత్రి మాడల్ సినిమాలో దిగంబర, అర్ధదిగంబర యువతుల నాట్యం చూచి వచ్చారు. ఇవాళ్ళ ఉదయం దానినే సర్వేశ్వరబాబు యింట్లో, విమర్శిస్తూ వున్నారు. విమర్శన క్రమంగా చిత్రపటంనుంచి బయలుదేరి అభినేత్రిణుల వయసూ, రూపం, వృత్తీ, తర్వాత నడత వరకూ వచ్చింది. ఆఖరుకు నడతనే కేంద్రం చేసుకొని పరిక్రమం చేయ నారంభించింది. నిన్నరాత్రి అధికంగా చప్పట్లు కొట్టిన వారే యివ్వాళ అభినేత్రిణుల నిర్లజ్జతకు మండి

పోతూ, వాళ్ళ సతీత్వాన్ని సందేహిస్తున్నారు. దురదృష్టవశాత్తు దౌర్భాగ్యంచేత, చటక్ ఆగోవనుపోతూ, సర్వేశ్వర రావు యింట్లో గోలవిని, నిలబడ్డాడు. ఒక్కనిమిషం వరకు విని, ఇక సహించలేక, లోపలకు జొరబడ్డాడు. తర్వాత సంగతి పాఠకులకు తెల్సును.

మీటింగ్ ఆగిపోవటానికి కారణంవుంది. స్వర్గీయ చక్రపాణి చాకీ సుపుత్రుడు, మిష్టర్ చటక్‌చాకీ. పేటలో అందరికంటే గొప్ప విద్వాంసుడు. అంటే బి. ఏ. ప్యాసయ్యాడు. అందరికంటె ధనవంతుడు. అంటే యీ పేటలో నూటికి డెభ్భైయిదు యిళ్ళకు యజమాని. ప్రస్తుతం అవివాహితుడు. మంచనాట్యాం అంటే థియేటర్, ఛాయానాట్యం అంటే సినిమా విషయంలో యీయనకున్న జ్ఞానం అపారం. తండ్రి ఆస్తి అంతా ట్రస్టీలకువప్పజెప్పిపోయాడు, అందువల్లే యింత వరకు ఫిల్ముకంపెనీ పెట్టలేదు. లేకపోతే, యిప్పటికి ప్రతిపట్టణంలోనూ ఇతనిఫిల్ములంటే గోలపుట్టి పోయేవి. కంపెనీ పెట్టకపోతేయేం, ప్రతిరోజూ సినిమాచూస్తూ హాలీవుడ్‌లో వున్న ప్రతినటికీ ఉత్తరం వ్రాస్తూ వుంటాడు. మూడో అంతస్తులో, అంటే, చదివే గదిలో పెద్దపెద్ద అద్దాలు పెట్టేశాడు. వాటిలోచూస్తూ, 'వేలంటినో' 'నోవేరో'ల యాక్టింగు నేర్చుకొని, ఇంటి యజమానురాలు, అంటే ఇతని పినతల్లి కోడలు యెదుట పరీక్ష యిస్తూవుంటాడు. ఒకరోజున, ఒకే ఆటను వరుసగా మూడుసార్లు చూసి యింటికివచ్చి

తలుపు వేసుకొని 'రూడోల్ఫ్' మాదిరిగా కళ్ళు త్రిప్పడం, అనుకరించ మొదలెట్టాడు. ఒక ఘంట తంటాలు పడేవరకు కొంతఫలితం కనపడింది. వెంటనే వంటయింటి వాకిటి దగ్గరకు వెళ్ళి కేకేశాడు "వదినే!"

వదినె చేతిలో తెడ్డుతోసహా వాకిట్లోకివచ్చి నిలబడింది.

"నేడు మహా పరీక్షాదినం—వదినే! ముఖ్యంగా నీకు. నేను నీవైపు చూస్తాను. నీ మనస్సులో కలిగిన భావాలు దాచకుండా చెప్పాలి, నాతో—చెప్తావా ?" చటక్ అడిగాడు.

"ఆఁ. చెపుతాను" వదినె అన్నది.

"అయితే సరిగ్గా నిలబడు" అని పెదవులు బిగించి మదిరస్థిమిత నేత్రాలతోచూచి, అడిగాడు "చెప్పు—గుండెలు ఏమైనా పీచుపీచు మన్నాయా, లేదా ?"

వదిన పమిటచెంగు నోటికి అడ్డం పెట్టుకొంటూ అన్నది—"లేదే, నవ్వొస్తోంది."

చటక్ మొహంమీద నిరాశ తాండవమాడింది. ఆ రోజునుంచే అతనికి భారతీయ స్త్రీలమీద ఉండే శ్రద్ధ ఎగిరి పోయింది. పెళ్ళి చేసుకోకూడదని ప్రతిజ్ఞ చేసుకొన్నాడు. ఒకవేళ చేసుకొన్నా భారతీయ స్త్రీని మాత్రం చేసుకోనని గట్టిగా ఒట్టు వేసుకొన్నాడు. కాని దీంట్లోకూడా చిన్నపేచీ వుంది. స్వర్గీయ 'చక్రపాణి చాకీ' తనవిల్లులో, కొడుకు మ్లేచ్ఛ స్త్రీని పెండ్లి చేసుకొన్నా, వాళ్ళ అన్నం తిన్నా, తన

ఆస్తి కుమారుడికి చెందకూడదని ఒక షర్తు పెట్టిపో యాడు. అందువల్లే చటక్ హాలీవుడ్‌లో వున్న అభి నేత్రిణుల నందరిని మనసులో పెళ్ళి చేసుకొన్నాడు. తన మానస భార్యల ఫోటోలు, 'చక్రపాణి నివాసం' లో క్రింద వరండానుండి, మూడో అంతస్తుకు పోయే మెట్లవరకూ తగిలించాడు.

ఇతనికొక శిష్యుడున్నాడు. పేరు సోమేంద్రుడు. చటక్‌తో చాలరోజులు స్నేహముచేసి, చటక్ మాది రిగా తన యిల్లుకూడా, హాలీవుడ్ చేశాడు. కాని ఒక రోజున యితన్ని నట్టేట్లో ముంచేశాడు! ముఖాన బాసికం కట్టుకొని హిందూస్త్రీని పెండ్లి చేసుకోడానికి కారులో పోతూ వుండటం చటక్ చూసి మండి పోయాడు. కాని ఏంచేస్తాడు? సోమేంద్రుడు పైత్రుక భవనము లోనే వుంటున్నాడు. అద్దె పెంచటానికి కూడా వీలులేదు. తన కోపాన్ని స్నేహితుల దగ్గిర వెళ్ళ బోసుకొని తృప్తిపడ్డాడు. అసలు సంగతి యిదే—అద్దె పెంచుతాడనే భయంతోనే సమాధా నాలన్నీ దిగమింగి, ప్రశ్నకు ఎవ్వరూ జవాబు చెప్పలేదు. కేవలం ఒకాయనమాత్రం కొంచెం వూగులాడాడు, జవాబు చెప్పటానికి. ఆయన పేరు వ్యోమకేశబాబు. గత రెండు సంవత్సరాలనుంచి, ఏదో ఒక మంచిపిల్లకోసం వెతుకుతూ వున్నాడు. సంవత్సరానికి మూడువందల అరవైరోజులు పిల్లల యిళ్ళల్లోనే పూరీ, మిఠాయీలు సద్వినియోగం

చేస్తున్నారు. నేటికి మూడుదినాలనుండీ, సర్వేశ్వర బాబుకు అతిథి. ఇతరులను చూడడంవల్ల యితనికి కూడా చటక్ అంటే మొదట కొంచెం ఆదరం కలిగింది. కాని అదెక్కువసేపు నిలవలేదు. చటక్ ప్రశ్నకు జవాబు ఎవ్వరు యివ్వలేక పోయేవరకు తానే యిచ్చాడు—చటక్ దర్పంచూచి, అతనికి కోపం వచ్చింది. వ్యోమకేశబాబు మాట పూర్తికాక ముందే చటక్ టక్కున జవాబిచ్చాడు. నిమిషాల లోనే ఉత్తర ప్రత్యుత్తరాలు ఆఖరి కంఠాయములో ప్రవేశించినవి. సతిని గురించీ, సతీత్వాన్ని గురించీ గొప్ప తర్కయుద్ధం ప్రారంభమయింది. నూర్జహాన్ పతివ్రతా లేక కేథరిన్—ఈ సంగతి తేలకముందే ముందు గాజులతో అలంకరించబడ్డ గుండ్రని చేయీ తరువాత నొక్కులవెంట్రుకలూ అటుపిమ్మట చక్కని ముఖం, తలుపు సందులోనుంచి కనుపించినై. దానితో పాటు విన్పడింది: "నాన్నా, నా టెస్టు—"

చటక్, తర్కమాపేసి, యువతివైపు చూచి, తల వంచుకొన్నాడు — చూపు యెవరిమాదిరిగా చూడాలో నిశ్చయించుకోలేక పోయాడు. వ్యోమకేశబాబు తర్కసూత్రాన్నే మర్చిపోయి, ముక్కు తుడుచుకో సాగాడు. సర్వేశ్వరబాబు కొంచెం విచలితుడై అన్నాడు " ఆఁ, అలాగే! ఇక లేస్తున్నాములే." తర్వాత చటక్ వైపు చూచి అన్నాడు. "అమ్మాయి, బి.ఏ. పరీక్షలో కూర్చుంటున్నదికాదూ?"

"కళ్లల్లో నలుసల్లే మెరమెరలాడే టంత చక్కంది కాదు, కాని చూట్టానికి బాగానే వుంటుంది, సరే" అంటూ చేయి కడుక్కొని లేచాడు.

"ఘటకుల్ని పంపేదా?" వదినె వెంటనే అడిగింది.

చటక్, మెడ రెండున్నర మూడంగుళాల వారగా పెట్టి అన్నాడు. "ఉఁహుఁ! ఇంకంత దూరంగా లేదు."

వదినె యిక ముందుకు పోలేదు; మరది హిందూ స్త్రీల వైపుకు దృష్టి మళ్లించాడని గ్రహించింది.

రెండవ రోజు కూడా చటక్ అనవసరంగానే సర్వేశ్వరబాబు యింటికి వెళ్లి నిలబడ్డాడు. లోపల యెవరో పాడుతున్నారు. హార్మోనియం శబ్దం పాడే వాళ్ళ గొంతును అణచి వేసింది. అందువల్ల లోపల యెవరు పాడేది తెలియలేదు. పాట బాగా వుంది. నోరు తెరుచుకొని వినసాగాడు.

"మలయ పవను కౌగిలిలోనె పులకరించి
హాయిగా గంతమెత్తు ప్రాయంపు వంశి
విశ్వ మోహను జిలిబిలి పెదవులంటి
యవశమైపోయి యేమి చేయంగలేదు" (దే.కృ)

పాట పూర్తికాగానే- "సర్వేశ్వరబాబున్నాడా" అంటూ చటక్ యింట్లో ప్రవేశించాడు. కార్పెట్ మీద హార్మోనియం కెదురుగా వ్యోమకేశబాబు కూర్చొని వున్నాడు. ప్రక్కనే వేడి వేడి వంకాయ బజ్జీ, ఒక టీకప్పూ పెట్టి వున్నాయి. చటక్ శత్రుపురిలో ప్రవేశించినట్లుగా భావించాడు. అలవాటు

ప్రకారం జేబులో చెయ్యి పెట్టాడు. పిస్తోలుకు బదులు బ్లూపెన్సిలు చిక్కింది. దాన్ని గుప్పెట్లో పట్టుకొని, వ్యోమకేశబాబు వంకకోర కోరచూస్తూ అన్నాడు "ఇంకా మీరు ఇక్కడే వున్నారా?"

వ్యోమకేశ బాబు స్ప్రింగ్ మాదిరిగా లేచి మూడడుగులు వెనక్కు వేశాడు. టీకప్పు తిరగ పడింది. చటక్ దొర్లాడే టీకప్పువంక వేలు చూపిస్తూ అన్నాడు —"అది సరిగ్గా నిల బెట్టండి."

వ్యోమకేశబాబు తత్తరబిత్తర లాడుతూ వెనక్కు పోవడం, టీకప్పు దొర్లటం, బహుశా యింట్లో వినప డొచ్చు. నిన్నటి మాదిరిగానే తలుపు తెరచుకొని, నిన్నటావిడే ప్రవేశించింది. చటక్ ఒకకన్ను కొద్దిగా మూసుకొని రెండోకన్ను బాగావిప్పుకొని చూశాడు.

యువతి అన్నది. "నాన్నగారు ఇంట్లోలేరు."

చటక్ చేతిలో పెన్సిలు వణకింది. చాలా మృదు స్వరముతో అడిగాడు."అయితే కూర్చోమంటారా?"

యువతి అన్నది. "నాకు యగ్జామినేషన్ వుంది."

చటక్ కళ్లు నిప్పులు కక్కినై. మనసులో గొణు క్కున్నాడు 'వ్యోమకేశబాబుకు వంకాయ బజ్జీలు, టీ,—నాకేమో యగ్జామినేషన్!' పైకన్నాడు "సరే!"

యువతి వెళ్లిపోయింది.

చటక్ వ్యోమకేశునివంక చూచి అడిగాడు. "ఇంకెన్నాళ్లుంటారు?"

"సర్వేశ్వరబాబు ఏదో తేల్చేవరకు," వ్యోమ

వ్యోమకేశబాబు సంతోషం పట్టలేక వుబ్బిపోయి హాల్లోవున్న తలుపులు, కిటికీలు, అన్నీ బిగించేశాడు.

అరఘంట అయ్యాక తలుపు దగ్గర ఆడ గొంతు సన్నగా వినిపించింది. "వ్యోమకేశ బాబూ వున్నారా?"

వ్యోమకేశబాబు తలుపు గడియ వంక చూస్తూ [illegible]

బయట కొంతసేపు గజ్జెల చప్పుడు అస్పష్టంగా వినపడింది. తర్వాత ప్రశ్న—"తమరు యిప్పుడు ఖాళీగా వున్నారా?"

వ్యోమకేశబాబు వెనుక వాకిలివంక చూశాడు. అమల తలుపు కానుకొని చదువుతూ వుంది. కొంచెం దర్పంగా జవాబిచ్చాడు- "ఆఁ. వున్నాను."

"బయటకు వస్తారా?"

"రాను" అని హార్మోనియంతీసి పాట ఎత్తుకున్నాడు—"మలయ పవను—"

తర్వాత హార్మోనియం ఆపేసి తలుపు దగ్గరగా చెవిపెట్టేడు, కాని బయట ఏ శబ్దమూ వినిపించలేదు.

అబ్బాయి యిష్టపడ్డాడు. ఇక అంతా అమ్మాయి యిష్టంమీదే ఆధారపడి వుంది. వ్యోమకేశబాబు అమ్మాయి వంక చూశాడు. కాని, ఆమె ముఖంలో ప్రణయ భావంగానీ, లజ్జ భావంగానీ, ఏమీ కనిపించలేదు.

*　　*　　*

మొగల్ థియేటర్‌లో ఆవాళ 'హేమ్లెట్'టాకీ. సర్వేశ్వర బాబుకు ఏదో పని వుండటం చేత అమల వెంట వెళ్ళలేకపోయాడు. వ్యోమకేశ బాబు అమల షేక్స్‌పియర్ నోటుబుక్కు చంకబెట్టుకొని, అమలతో ట్రాం ఎక్కాడు.

ఇంటర్వెల్లో అకస్మాత్తుగా వ్యోమకేశ బాబు భుజం మీద ఎవరో చేయి వేశారు. వ్యోమకేశ బాబు గాభరాపడి వెనక్కు చూశాడు— చటక్! చటక్ అన్నాడు—"బయటకు రండి" అమల నోటుబుక్కు చంకలో గట్టిగా అదుముకొంటూ వ్యోమకేశబాబు అన్నాడు—"ఇక్కడే చెప్పండి."

"ఇక్కడ చెప్పేమాటకాదు." అంటూ వ్యోమ కేశబాబు చెయ్యిపట్టుకొని లాగాడు.

"బయటికి వెళ్ళరాదూ?" అమల అంది.

ఏంచేస్తాడు! బయటికివెళ్ళి నిలబడ్డాడు. చటక్ అన్నాడు—"యింకా కొంచెం ముందుకు, ఆ లెదర్ గోడౌన్సు వెనకకు." మంత్ర ముగ్ధునివలె వ్యోమ కేశబాబు చటక్‌ను అనుసరించాడు. చటక్ ఎడమ చేతిలోవున్న ఆస్సఫర్డు యెడిషన్ షేక్స్‌పియర్ కుడి చేతిలోకి తీసికొంటూ అన్నాడు—"విను, వ్యోమ కేశ్! ఈప్రపంచంలో అమలను ప్రేమించేవారిద్ద రుండటానికి వీలులేదు. నీవన్నా వుండాలి; నేనన్నా వుండాలి. ఈచీకటిరాత్రిలో, ఈనిశ్శబ్దమైన గల్లీలో— పహరావాడు కూడాలేడు. నీతో డ్యూయల్ ఫైట్

(ద్వంద్వయుద్ధం) చేస్తాను. గెలిచినవారిది అమల!"

వ్యోమకేశుడు కంపిస్తూ అన్నాడు— "నేను చేయలేను."

"చేయాలి నీవు, కవర్డ్! గల్లీ కటువైపు నిలబడు. నీ చేతిలో నోటుబుక్కుంది; నా చేతిలో షేక్స్పియర్; ఇవే పిస్తోళ్లు. వదలేసెయ్ గుండు! ఒన్, టూ, త్రీ!"

బఁయ్ మంటూ రెండు వైపులనుంచీ పుస్తకాలు వచ్చేస్తున్నాయి. కాని లక్ష్యమువరకు చేరకముందే, సైకిలు ముందు చక్రానికి వచ్చి కొట్టుకున్నాయి. సైకిల్ వాలా దిగాడు. వ్యోమకేశుడు ఉత్తరపువైపు పరుగెత్తాడు. చటక్ దక్షిణంవైపుకు క్లైవ్ బ్రూక్స్ మాదిరి పెద్దపెద్ద అంగలు వేసికొంటూ, జారుకొన్నాడు. సైకిల్ వ్యక్తి అటు యిటూ చూశాడు. ఎక్కడా పోలీసులు లేరు.

పుస్తకాలు రెండూ భుక్తం చేసుకున్నాడు.

వాస్తవంగా యిది కథగాదు, నవల. కాబట్టి పాఠక, పాఠికలు సహజంగానే అడగవచ్చు—అమల గతి ఏమైందని?

ఏమీ కాలేదు. అమల యింటికివచ్చి టీ తయారు చేసి త్రాగింది. తర్వాత "వ్యోమకేశబాబు ఎక్కడున్నాడు?" అని అడిగింది. కాని ఎవ్వరూ జవాబు చెప్పలేదు.

రెండవరోజున చూచింది—వ్యోమకేశ బాబుకై

పంచిన ఫ్రాక్ కూరా అలాగే మూత పెట్టివున్నది. వ్యోమకేసుని జాడలేదు. "నా నోటుబుక్కు" అని అమల తండ్రిని అడిగింది.

"నేను చూడలేదు. వ్యోమకేశ బాబు యిచ్చి పోలేదా ?" సర్వేశ్వరు డన్నాడు.

"నా యగ్జామినేషన్—చటక్ బాబు యింటికి వెళ్లు నాన్నా, వ్యోమకేశబాబు అక్కడ వుంటాడేమో !" అమల అన్నది.

సర్వేశ్వరబాబు వెళ్ళాడు. చటక్ మంచముమీద పడివున్నాడు. గళ్ళీలోనుంచి పారిపోయేటప్పుడు కిల్లీ కొట్టువాడు దొంగఅనుకొని వెంటపడితే డగ్లస్ ఫైర్ బ్యాంక్సు స్టైల్లో ఎగిరి రిక్షా ఎక్కబోయి చార్లీచాప్లిన్ స్టైల్‌లో వెనక్కి పడ్డాడు. పెద్దదెబ్బ తగిలింది. ఈ సంగతి సర్వేశ్వర బాబుకు తెలియలేదు. వ్యోమకేశ బాబుకానీ, నోటుబుక్కుగానీ లేదనిమాత్రం తెలుసు కొన్నాడు.

అమల పాపం ఏడ్పుమొఖం పెట్టింది. వ్యోమకేశ బాబు కోసం కాదు, నోటుబుక్కు కోసం. రేపే ఆమె టెస్టు.

ఇంతలో బయట యెవరో తలుపుకొట్టారు. సర్వే శ్వరబాబు వెళ్ళి తలుపు తెరిచాడు. ఒక యువకుడు హాలులో ప్రవేశించి అడిగాడు. "మిస్ అమలాఘోష్ యిక్కడ—"

అమల లేచి నిలబడుతూ అన్నది. "నేనే."

"ఇదిగో మీ నోటుబుక్కు. నిన్న రోడ్డుమీద దొరికింది" యువకుడు అన్నాడు.

అమల ముసిముసి నవ్వు నవ్వుతూ అంది. "మీరు నన్ను రక్షించారు. పుస్తకంకోసం వెదకి వెదకి ఏడ్పు వచ్చింది. మీకు ఎక్కడ దొరికింది?"

ఆగంతకుడు వీరేశదాసు నవ్వుతూ అన్నాడు. "ఆ సంగతి అడుగబోకండి. మీ నోటుబుక్కుతో పాటు యిదికూడ తీసికోండి. నానోట్సు. స్ట్రిఫెన్ దొర గారు చెప్పింది, ఉపయోగించవచ్చు."

అమల అన్నది— "థాంక్సు! టీ పుచ్చుకోండి" టీ అయింది.

ప్రొఫెసర్ వీరేశదాసు ఆరోజు క్లాసుకు ఫస్టు పీరియడు అటెండు కాలేక పోయాడు.

చటక్ తిరిగి ఆరోగ్యం పొందాడు.

మళ్ళీ ఒకరోజున అనవసరంగానే సర్వేశ్వరబాబు యింటి కిటికీ వద్దకువచ్చి నిలబడ్డాడు. లోపలకుచూచి ఆంటోనియో మూర్కొన్న మాదిరిగా కనుబొమ్మలు చిట్లించు కొన్నాడు. ప్రొఫెసర్ వీరేశదాసుకు చాలా దగ్గరగా కూర్చొని, అమల షేక్స్పియర్ చదువుతూ ఉన్నది. ఛీక్!

చటక్ యింటికి తిరిగివచ్చేటప్పుడు త్రోవలో వ్యోమకేశబాబు కారపు శనగలు తింటూ పోవడం చూశాడు. చటక్ వాడియెదుటకు పోయి డగ్లస్

ఫైర్ బ్యాంక్సు స్టైలులో నిలబడి అన్నాడు "ఇప్పుడు?"

గొంతులో శెనగలపొడి అడ్డపడింది; కొంచం దగ్గి గొంతు సవరించుకొని వ్యోమకేశబాబు అన్నాడు "అమల యింటికి మళ్ళీ నే నెప్పుడెళ్ళేనూ ?"

చటక్ ఆమాట వినకుండానే మళ్ళీ రెట్టించాడు— "ఇప్పుడు ?"

"గ్రేస్ట్రీటుకు పోతున్నా—అక్కడ ఒక అమ్మాయి వుంది" అంటూ వ్యోమకేశబాబు ఆగివున్న ట్రాం ఎగిరి ఎక్కాడు.

చటక్ కదలిపోయే ట్రాం వంకచూచి రోనాల్డు కోల్మను మాదిరి వ్యంగ్యంగా నవ్వుతూ అన్నాడు— "కవర్డ్ !"

---

# నారీద్వేషి

ఇంతకుపూర్వం చటక్ శిష్యుని ప్రసంగం కొంత వచ్చింది. అతన్నిగురించి సవిస్తారంగా వ్రాయటం అవసరం. అయినా అతి సంక్షేపంగానూ, అవలీలగానూ వ్రాస్తున్నాను. ఇది కథ కావచ్చును, నవల కావచ్చును. ఇతిహాసం అయినప్పటికీ ఆశ్చర్యంలేదు.

సోమేశ సమద్దార్ హ్రస్వనామధేయం సోమూ. యూనివర్సిటీలో ఫిఫ్త్‌యియర్ స్టూడెంటు (మొదటి సంవత్సరం ఎం. ఏ). జీవనాంకసంఘానికి ప్రెసిడెంటు కూడాను. ఈ సంఘాన్ని సృష్టించినవారు సోమూ, చటక్‌లు. చటక్ దీనికి పాట్రన్ (patron). కొద్ది ధన సహాయం కూడా చేశాడు.

ఈ సంఘము యొక్క క్రీడ్ (creed) ఏమంటే 'జీవిత మొక మహా నాటకం; ప్రతి ఒక్క రోజూ దానిలోని ఒక్కొక్క కొత్త దృశ్యం. ఆహారంలో, విహారంలో, ప్రతీహారంలో, వ్యతీహారంలో—అన్నిటిలో యీ నాటకపు అనుభూతిని పొందటమే మానవజీవితానికి చరమలక్ష్యం.'

కాని హఠాత్తుగా సోమూ యీ సంఘునీతికి విరుద్ధమైన గర్హితకార్యం ఒకటి చేశాడు. ఫలితం, జీవనాంక సంఘానికి జీవనాంత మయింది. చటక్, సోమూలకు స్నేహవిచ్ఛేద మయింది. భవిష్యత్తులో సోమూ ఈ దుష్కర్మానికి ఫలం ఏమనుభవిస్తాడో ఎవరు చెప్పగలరు? జరగబోయేదేమిటో జరిగి తీరుతుంది. దాన్ని

గురించి తల పగలగొట్టుకోవటం వ్యర్థం. కాన ఇక్కడ జరిగింది మాత్రమే వ్రాస్తున్నాను.

సోమూ చటకీకు భావదాస్యుడు. థర్డ్ క్లాసులో ఇద్దరూ కలిసినప్పటినుంచీ వదలకుండా సినిమాలూ, థియేటర్లూ చూస్తూవస్తున్నారు. వివాహం చేసుకోమని ప్రతిజ్ఞ కూడా చేసుకున్నారు. హాలీవుడ్ అందగత్తె వచ్చి తమ్ము చేపట్టమని ప్రార్థించినా చేసుకోరు !

సోమూ నాయనమ్మా, వదినా యిద్దరూ తిరుపతి వెంకన్నకు ముడుపులుకూడా కట్టారు. ఏం లాభం? సోమూమతి మాత్రం మారలేదు. అయినా ఒకసారి వదినా నాయనమ్మలు సోమూను బలవంతపెట్టి ఒక పిల్లను చూడటానికి పంపారు. దానికి ఫలితంకూడా వికటంగానే పరిణమించింది.

అది ఈ విధంగా జరిగింది.

శివరాత్రి నాటిరాత్రి అనార్కలీ నాటకం చూసి సోమూ ప్రొద్దుపోయి యింటికి తిరిగివచ్చాడు. వరండాలో దాసీది పండుకొని ఉంది. దాని పేరుకూడా అనార్కలీ—అనార్ అనే పిలుస్తూ ఉంటారు.

నిద్రపోయే అనార్‌ను చూడగానే సోమూలో జహంగీర్ ప్రవేశించాడు. రెయిలింగ్ ఆనుకుని, కుడి చేయి పైకెత్తి, "ఈమె ఆ అనార్కలీయేనా? బాల్యకాలంలో ఎవరినైనతే—అనార్కలీ—అ—" అని అభినయ సహితంగా చెప్పసాగాడు.

అనార్ హఠాత్తుగా మేలుకొని చీత్కారంచేసింది. నాయనమ్మ జపమాల వదలి పరుగిడ వచ్చింది. వదినె లబలబ లాడుతూవచ్చి సోమూనెత్తిన కడివెడు చన్నీళ్లు కుమ్మరించింది.

మరుదినం వదిన నాయనమ్మలిద్దరూ కూడబలుక్కొని ఉపవాసం చేయసాగారు. సోమూ విధిలేక పాల్పాడాలో ఉండే విశ్వాసబాబు యింటికి పెళ్ళి కుమార్తెను చూడబోయాడు. ఇదివరలో చాటుగా పెళ్ళివిషయమై ప్రస్తావన జరుగుతోనే ఉంది. ఎక్కువ ఆలస్యం చెయ్యకుండానే పిల్ల సింగారించుకొని ఎదుటికి వచ్చింది. సోమూ ఆ అమ్మాయి ఎడమచెయ్యి గట్టిగా పట్టుకొని 'కచదేవయాని' లోని కచునిమాదిరిగా చదివాడు.

"పతికి యోగ్యుడను గాను కుమారీ,
బ్రహ్మచర్యవ్రతధారిని నేనూ—"

పిల్ల గడగడా వణకసాగింది. భయంతో నయింది తెలీదు—సిగ్గుతో నయిందీ తెలీదు. ఆపిల్ల అన్న అవినాశుడు, "ఆఁ! ఆఁ!" అంటూ పతుగెత్తు కొచ్చాడు. కాని ఫస్టుక్లాసులో ఫస్టున పాసయిన సోమేశ సముద్దార్ వంటిమీద చెయ్యి వెయ్యటానికి సెకండు యియర్ తప్పిన కుర్రవాడికి సాహసం చాలక పోయింది. సోమూ బంతివలె లేచి ట్రామెక్కి ఇంటికి చేరాడు.

ఇక తన వివాహ విషయమై ఆలోచ విలాసా

లేమైనా జరిగాయంటే కాలువ ఒడ్డున ఉన్న నిష్కళ్ళ యానంద మఠంలోకి వెళ్ళి సన్యాసం పుచ్చుకొంటా నని,— పిల్ల నచ్చిందో లేదో తెలుసు కోవాలని వచ్చిన వదినె నాయనమ్మలను సోమూ భయపెట్టాడు.

ముప్పై రెండు పళ్ళలో మిగిలిఉన్న ముందు రెండు పళ్ళతో నాలుక కొరుక్కుని నాయనమ్మ అంది— "శివ, శివ! అలా అనగూడదు నాయనా!"

సోమూ తన చదివేగది తలుపు తాళ్కున వేసు కొని అన్నాడు—"అంటాను! లక్షమాట్లు అంటాను! ఆకాశంలో చంద్రతారలు సాక్షి! స్వర్గంలో మందా కిని సాక్షి!" తరవాత ఇక వినపళ్లేదు. కిటికీ తలుపులు కూడా బిగించుకున్నాడు.

వంటయింట్లో కూర్చుని 'దుర్గేశనందని' చదువు కుంటున్న వదినె పుస్తకంలో మొహం పెట్టి వెక్కి వెక్కి ఏడవసాగింది. ఇక వివాహప్రసంగం ఎవ్వరూ ఎత్తలేదు.

ఇది భూమిక.

ఇక కథారంభం.

ఆ షా ఢ స్య ప్ర థ మ ది వ సే — నవమేఘ భారంతో ఆచ్ఛన్నమైవున్న నీలాకాశం ఒక తరుణి సర్వాంగాలూ చుట్టుకొన్న నీలిరంగు చీరె చెరగు వలె వుంది. మెరుపులు కూడా మెరుస్తున్నాయి—ఆ చెరగున కుట్టిన బుటేదారీపనివలె. ఆకాశంలో మేఘ

గర్జన, క్రింద ట్రాం గరగర. ప్రతి గల్లీమూలనూ కారపు శనగలు అమ్మేవాళ్ళ విరామంలేని కేకలు.

సోమూ ఒక పొట్లం కారపుశనగలు కొని బస్సు ఎక్కాడు. పది గంటల బస్సు కావటంవల్ల ప్రయాణీకులు నిండుగా ఉన్నారు. వెనుక సీటులో ఒక మూల కాస్తచోటుంది. సోమూ పుస్తకాలు ప్రక్కన పెట్టుకొని కూర్చున్నాడు.

బస్సు పోతూ పోతూ ఆగింది. చేతులో పుస్తకాలూ, నోటుబుక్కులూ పట్టుకుని ఒక అష్టాదశి వచ్చి ఎక్కింది. బస్సులో ఉన్నవాళ్ళంతా ఒక్కమాటు మెడ చాచి చూచారు. అందులో సోమూ ఒక్కడు మాత్రమే నిర్వికారభావంతో చూచాడు.

బస్సు కదిలింది. యువతి ఒక్కసారి బస్సంతా చూచి సోమూ వద్దకు వచ్చి నిలబడి లోలుప దృష్టితో సోమూ ప్రక్కన వున్న పుస్తకాలవంక చూడసాగింది. పుస్తకాలు తీస్తే ఆమె కూర్చోటానికి చోటు దొరుకుతుంది. కాని అంత దగ్గరగానా! సోమూ సర్వాంగాలూ సూదులతో పొడిచినట్లయింది. ఏవగింపుతో అతను పుస్తకాలు తీసుకొని లేచి నిలబడ్డాడు.

యువతి అవలీలగా కూర్చుని అంది—"థాంక్స్! ఎక్కడకు పోతున్నారు?"

సోమూ చేతులోని పుస్తకాలను నిర్దయగా నలుపుతూ అన్నాడు—"ఏట్లోకి!"

యువతి అంది—"అవి దర్భాంగా బిల్డింగ్స * కావుగదా ?"

సోమూ అదేవిధంగా నిర్వికార భావంతో అన్నాడు—"ఆఁ!"

యువతి అంది—"పదండి నే కూడా వస్తాను."

సోమూ అన్నాడు—"థాంక్స్!"

ఇద్దరూ ఒక క్లాసులోనే చదువుతున్నారు. ఒకరి మొహం ఒకరు ఇదివరకే ఎరుగుదురు. సంభాషణకు మాత్రం ఇదే మొదలు.

కమలకూడా ఫస్టుక్లాసులోనే పాసయింది, సోమూను రెండుమెట్లు దిగువగా. అతనితో మాట్లాడాలని చాలారోజులనుంచీ ఆమెకోరిక—చదువులో సహాయంగా ఉంటాడని. కాని సోమూ స్వభావం సంగతి విన్నాక దగ్గరకు పోవటానికే భయపడ్డది. దైవ యోగంవల్ల ఇవాళ పరిచయం అయినందుకు చాలా సంత షించింది. అతని స్వభావాన్ని కూడా బాగాగు ర్తించింది.

బస్సు దిగి టకటకా సోమూ మూడో అంతస్తుకు ఎక్కేవరకు వాకిట్లోనే కమల ప్రత్యక్షమయింది. ఆమె లిఫ్ట్ ద్వారా ఎక్కింది. సోమూను చూడగానే కారపుశనగలపొట్లం అందిస్తూ అంది—"తీసుకోండి. బస్సులో వదలెట్టి వచ్చారు."

ఇలా అసంగతంగా స్నేహితం చేసుకోబోవటం

* యూనివర్సిటీ భవనాల్లో కొన్ని భవనాలు.

చూచి సోమూకు నోరూరుతుండేది. "అక్కర్లేదు. టిఫిన్ తీసుకోండి" అన్నాడు.

కమల అంది—"థాంక్స్!"

అయిదు నిమిషాలు గడిచాక.

సోమూ తదేకధ్యానంతో ఏదో రాసుకుంటున్నాడు. కమల వెనగ్గావచ్చి అడిగింది—"పెన్సలు కాస్త యిప్పిస్తారా?"

సోమూ తలతిప్పి చూచాడు. లోలోపల పళ్లు నూరుతూ జేబులోనుంచి కానీ బయటకు తీసి డస్కుమీద పెట్టి అన్నాడు—"తీసుకుపోయి కొనుక్కోండి."

కమల కానీ తీసుకొని అంది—"థాంక్స్!"

తరువాత, నాలుగు గంటలకు.

సోమూ లైబ్రరీలో కూర్చుని 'అపాలోజియా' (Apologia) నూతన సంస్కరణంమీద నోట్సు రాసుకుంటున్నాడు. కమల వచ్చి తెరచిఉన్న పుస్తకంమీద కానీ వేస్తూ అంది—"కారపు శనగలకానీ—"

పుస్తకంమీద ఒకగుద్దు గుద్ది పెదవి కొరుకుతూ సోమూ అనబోయాడు—"డా—" ఇంతలో ఎదుట ప్రొఫెసరు గోపాల బాబును చూచి "—ంక్స్!" అని పూర్తి చేశాడు.

కమల వెనుకనుంచి మృదుస్వరంతో "డాంక్స్" అని ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వెళ్లిపోయింది.

సోమూ ముందున్న ఇంగ్లీషు పుస్తకంలోని అక్షరాలు పార్సీ అక్షరాల మాదిరిగా అలుక్కుపోయినై.

ఇక ఆ రోజుకు నోట్సు రాయటం పడలేదు.

సాయంకాలం నాయనమ్మతో పాటు వదినె మిద్దె మీదికి వచ్చేటప్పటికి సోమూ కారాబద్ధ జగత్సింహుని వలె అటూ యిటూ పచారుచేస్తూ గొణుక్కుంటున్నాడు — కమలా, చపలా, తబలా — హూఁ, హూఁ—"

ఈఅస్థిరతకు కారణం ప్రాస కుదరక పోవటం అని లేఖకుడు ఊహిస్తున్నాడు. మనమడి మనస్సు కమలా ఫలాల మీదికి పోయిందని నాయనమ్మ అనుకుంది. కమల అనేది ఒకపిల్లపేరు కావచ్చుని వదినె అంచనా వేసుకుంది. వదినె, నాయనమ్మలు చప్పుడు చెయ్యకుండా వచ్చినవారు వచ్చినట్టుగానే వెళ్లిపోయారు. నేను మాత్రం లేఖకుణ్ణి కావటంవల్ల కథ పూర్తి చెయ్యటం కోసం అదృశ్య రూపంతో సోమూతో పాటు ఉండిపోయాను.

ఒక గంట కష్టపడి 'లా' చివర గల చెడు శబ్దాలన్నీ కూర్చి ఒక కవిత్వం తయారు చేసి పగతీర్చుకున్న సంతోషంతో వాలు కుర్చీమీద జారగిలబడి నిట్టూర్చాడు.

మర్నాడు.

ప్రొఫెసర్లు రావటాని కింకా వ్యవధానం ఉంది. సోమూ కోపంతో కమలా, ఆమె సహాధ్యాయినులూ కూర్చునే బెంచీవేపు అప్రయత్నంగా చూస్తు

న్నాడు. ఇంతలో వెనుకనుంచి ప్రశ్న వినపడింది—
"ఇవాళ టెంపర్ ఎలా ఉంది సమద్దార్‌జీ?"

సోమూ తిరిగి చూచాడు—కమల! క్లాసు నిండా పిల్లలు. వచ్చిన కోపాన్నంతా దిగమింగి నిన్న సాయంత్రం రచించిన కవిత్వం అందిస్తూ అన్నాడు—"ఇది తమదే, తీసుకు పోండి."

కమల కాగితం తీసుకొని "థాంక్స్!" అంటూ వెళ్లిపోయింది.

సోమూ లోలోపల గుర్రు పెట్టాడు.

కమల చేసిన పరిహాసానికి చక్కని జవాబు ఇచ్చానన్న ఆనందంలో సాయంత్రం సినిమా చూచి సోమూ ఇంటికి వచ్చేటప్పటికి వదినె పెద్దకవరు ఒకటి యిచ్చింది. సోమూ మూడో అంతస్తుకు వెళ్లి విప్పి చూచాడు. అందులో యిలా వ్రాసి ఉంది:

'థాంక్స్ ఫర్ యువర్ కాంప్లిమెంట్స్. నాకు చిత్రం గీయటం తెలుసు కాని కవిత్వం వ్రాయటం చేతకాదు. అందువల్లనే—

ఇట్లు,
కమల.'

దళసరిగా వున్న చదరపు ఆర్టుపేపరుమీద యీ నాలుగు పంక్తులూ వ్రాసి ఉంది. కాగితం తిప్పిచూచే వరకు అచ్చంగా సోమూ మాదిరి చిత్రం ఒకటి గీసి ఉంది. కారపు శనగల పొట్లం ఒకటి మాత్రం అధి

కంగా నెత్తిమీద ఉంది. క్రింద పేరు—"కారపు శనగల సమద్దార్!"

ఎగ్గూ సిగ్గూ లేనిపిల్ల! చేతికందితే జుట్టు పట్టుకొని వీపుమీద నాలుగు వేసేవాడు! సోమూ పిడికిలి బిగపట్టి చేతులు విసర సాగాడు.

ఉత్తరం ఎక్కణ్ణించి వచ్చిందో కనుక్కోవాలని వచ్చిన వదినె కిటికీగుండా ఇదంతా చూచి అడిగింది-"అదేమిటి, మరిదీ! ఎవరినీ కొడుతున్నావు?"

ఎత్తిన చేతిని కోటుజేబులో పెట్టుకుంటూ సోమూ జవాబిచ్చాడు—"వేధించబోకు! ఎక్సర్‌సైజ్ చేసుకుంటున్నా."

వదినె మళ్ళీ ప్రశ్నించింది—"డంబెల్స్ ఏవీ?"

జేబులో పెట్టిన చెయ్యి తీసి పిడికిలి విప్పుతూ సోమూ అన్నాడు—"ఇక డంబెల్సు అక్కర్లా. ముద్గరాలు కావాలి!"

సోమూకళ్ళు చూసేవరకు వదినెకు భయం వేసి తత్తరబిత్తర లాడుతూ దిగిపోయింది. సోమూ మళ్ళీ చిత్రంవంక చూచాడు. ఈచిత్రంముందు అతనికవిత్వం ఏభూపానికీరాదు. ముల్లుతీసి కొర్రుపెట్టుకొన్నట్టయింది.

ఇంతలో నాయనమ్మ వచ్చి అడిగింది—"త్రిఫల కషాయం తెచ్చేదా, నాయనా?"

సోమూ తీవ్రస్వరంతో అన్నాడు—"త్రిఫలకషాయం లాభంలేదు—షట్ఫలకషాయం కావాలి."

త్రిఫలకషాయానికి బదులు షట్ఫలకషాయం ఇవ్వ

వచ్చునేమో కనుక్కురమ్మని నాయనమ్మ దాసీ దాన్ని వైద్యునియింటికి పంపింది.

3) ఫలకషాయం త్రాగినా ఆరాత్రి సోమూకు నిద్ర పట్టలేదు. రాత్రంతా మేలుకొని కమల చేసిన యీ పరాభవానికి ప్రతిక్రియ ఏమిటా అని ఆలోచించాడు. ఇక కవిత్వంతో కుదరదు. కమలఫోటో కనక ఒకటి దొరికితే గొప్పచిత్రకారునివద్దకు వెళ్ళి వ్యంగ్యచిత్రం (cartoon) ఒకటి గీయించవచ్చు. ఇది బాగానే ఉంది. కాని ఫోటో దొరికే దెలా? ఆమె నడిగితే గుట్టంతా బయటబడుతుంది! అయితే—

ఉపాయం తట్టకపూర్వమే తెల్లవారింది. కాస్సేపు అటలాంటా, కాస్సేపు కమలా, కాస్సేపు మిల్టన్—యీ విచిత్రవిషయాల తాకుడుకు అతని మనస్సు అవసన్నమై పోసాగింది. ఇంతలో పదిగంటలయింది. సోమూ పుస్తకాలు చాతబట్టి ట్రాం ఎక్కాడు. ట్రాం కొంచెం దూరం పోయిందో లేదో కమల ఒక సహాధ్యాయినితో వచ్చి ఎక్కింది. సోమూ పుస్తకాలు చేత పట్టుకొని దిగటానికి ఉపక్రమించాడు. కమల ప్రశ్నించింది—"ఎక్కడకు వెళుతున్నారు?"

"కారపుశనగలు కొనుక్కోటానికి."

కమల ముసిముసినవ్వు నవ్వుతూ అంది—"నాక్కూడా తెచ్చిపెట్టండి—థాంక్స్!" వెంటఉన్న సఖి కిలకిల నవ్వింది. సోమూ గుడ్లురుముతూ దిగిపోయాడు.

ఒక గంట అయాక కమల డెస్కుమీదికి ఒక పొట్లం వచ్చింది. విప్పిచూస్తే కారపుశనగలకు బదులు అరటిపండు తొక్క ఉన్నవి. కమల నవ్వుకుంది.

కమలకు కోపం రాకపోవటం తను కూర్చున్న చోటినుంచి సోమూ చూస్తూనే వున్నాడు. తను ప్రయోగించిన అస్త్రం యిలా పారకపోవటం చూచి మొహం మాడ్చుకున్నాడు.

బడివదిలాక గోల్‌దీఘీవద్ద నిలబడి సోమూ బస్సు కోసం నిరీక్షిస్తున్నాడు. కమల సహపాఠినులతో సహా వెనుక నిలబడి నోటిమీద జేబురుమాలు పెట్టుకొని నవ్వుతో వుండటం అతను చూడలేదు. బస్సు ఎక్కిన తరువాత కమలను చూచాడు.

"తమకు ప్రియతమమైన వస్తువు నాకు పంపారు—అందుకు థాంక్సు !" కమల కౌతుకంగా అన్నది.

సోమూ ముఖం త్రిప్పుకున్నాడు. ఆ పిల్లను పళ్ళతో పీకి, గోళ్ళతో రక్కి—ముక్కలు ముక్కలు చెయ్యాలన్నంత కోపం వచ్చింది.

మరుదినం సోమూ కాలేజీ టైముకు ఒక గంట ముందుగా బయలుదేరి బడి వదలక పూర్వమే యింటికి తిరిగి వచ్చాడు. కాలేజీలో తనకు తెలియకుండానే కమలవంక గంభీరంగా చూచాడు. కమల కూడా అతని వంక కౌతుకంగానూ, వెటకారంగానూ చూచింది !

ఈవిధంగా దాదాపు పదిహేను దినాలు గడిచినై.

ఈమధ్య వీరిద్దరికీ ఏవిధమైన సంభాషణా జరగక పోయినప్పటికీ పగ తీర్చుకోవాలనే సంకల్పం సోమూ బుర్రలో గూడు కట్టుకుంది. ఒక తుచ్ఛ స్త్రీ తనను పరాజితుని చేసి తన కళ్ళముందు యిలా స్వేచ్ఛగా తిరుగుతూ ఉండటం సోమూ సహించలేక పోయాడు! వదినకు యీ సంగతంతా చెబితే దీనికి ప్రతిక్రియ చెయ్యటానికి ఏదైనా సదుపాయం చేసేదే. కాని ఒక స్త్రీని అణచటానికి ఇంకో స్త్రీని ఆశ్రయించటం సోమూకు సుతరామూ యిష్టం లేదు.

ప్రతిక్రియ చెయ్యక తప్పేదీ లేదు. రోజూ అతన్ని చూచి కమల కౌతుకంగా నవ్వుతూ ఉంది. పైగా బస్సులో ఎక్కడ కలుస్తుందో అనే భయం మూలాన క్రమంగా క్లాసులో సోమూ నాగాలు పెడుతున్నాడు. ఏ విధంగానైనా కానీ కమలను మాత్రం ఎప్పటికీ నోరెత్తకుండా చేయాలి.

ఆవాళ సమయం చిక్కింది.

కాలేజీ వొదిలారు. కమల మరిద్దరు సహాధ్యాయినులతో కలిసి కారెక్కి టాక్సీవానితో బొటానికల్ గార్డెన్సుకు పోనిమ్మని చెప్తోంది. సోమూ విన్నాడు. అయిదారు నిమిషాలు ఆలోచించి దారినపోయే టాక్సీని ఆపి డ్రైవరును హెచ్చరించాడు—"బొటానికల్ గార్డెన్సు."

బొటానికల్ గార్డెన్సు. సాయంకాలం స్నేహితురాండ్రు చెట్లూ చామలూ నిరీక్షిస్తూ తిరుగుతు

న్నారు. కమల మాత్రం ఒక బెంచీకి చేరగిలబడి కూర్చుంది. దాపున ఎవరూ లేరు. సోమూ ఒక పొద చాటున నక్కి వీలుకోసం వేచివున్నాడు. కమలసఖులు కొంచెం దూరంగా పోగానే సోమూ ఎదుటపడి అన్నాడు—"కారపు శనగలు తింటారా ?"

కమల చకితురాలయింది. పూర్వం మాదిరిగా నవ్వలేకపోయింది. కాని అభ్యాసంవల్ల అనేసింది "థాంక్స్! ఇవ్వండి—"

సోమూ కళ్ళు నిప్పులు కక్కినై. కమల కుడిచేయి గుప్పెట్లో బిగించి అన్నాడు—"నీ జుట్టు పట్టుకుని—"

అంటూనే సోమూ చకితుడయ్యాడు. కమల జడ వచ్చి అతని వక్షస్థలం దగ్గర పడింది. కమల ముఖాన నెత్తురుచుక్క లేదు.

హతాశుడై సోమూ బెంచిమీద కూలబడ్డాడు. కమల తన కళ్ళమీద చీరచెరగు పెట్టుకుంది.

కమల ఏడుస్తోందని సోము గ్రహించి తన గుప్పెట్లో ఉన్న చేతిని వదలి ఆదుర్దాగా అడిగాడు— "చెయ్యి నొప్పి పట్టిందా ?"

కమల చెయ్యి తీసుకోకుండానే అంది "ఉఁహుఁ!"

సోమూకు ఏమీ అర్థం కాలేదు. మళ్ళీ అడిగాడు —"మరెందుకు—"

కమల కళ్ళమీది చెరగు తియ్యకుండానే అంది— "ఆ చిత్రం చించి పారేసి నన్ను క్షమిం—"

సోమూకు నోరు లేవలేదు. బెల్లంకొట్టిన రాయి

వలె కూర్చున్నాడు. హఠాత్తుగా దూరాన నవ్వులు విని తలయెత్తి చూచాడు. కమల సహాధ్యాయినులు నవ్వుకుంటున్నారు.

సోమూ దడబిడగా లేచి అన్నాడు—"చేయి ఒరుసుకుపోయింది. టించెర్ అయొడీన్ పట్టీ—"అని, చుట్టమన్నట్టు చేయి త్రిప్పుతూ మెల్లగా జారుకున్నాడు.

కొంతదూరం పోయాక సోమూ ఒకమాటు తిరిగి చూచాడు. కమల తలపంచుకు నిలబడి ఉంది.

* * *

సోమూ మూడో అంతస్తు కెక్కి చూచాడు—వదినె కమల గీసిన చిత్తరువు చూస్తూ నవ్వుతూంది. సోమూ అన్నాడు—"వదినా, సర్వనాశన మయింది!"

వదినె గాభరాపడి అడిగింది—"ఏమయింది?"

సోము పక్కమీద చిత్తుగా పండుకొని అన్నాడు—"నారీ నిర్యాతనం."

వదినె భయంతో అడిగింది—"నీ నటన చాలించి, అర్థం అయేటట్లు చెప్పు, మరిదీ!"

సోమూ కళ్లు మూసుకొని చెప్పసాగాడు—"అయితే వింటావా? విను! సోమూ అనే పేరుగల కుర్రవాడొకడున్నాడు—" తరువాత కథంతా వినిపించాడు.

వదినె అంతా విన్నాక అంది—"చిత్రం వచ్చిన నాడే చెబితే, మరిదీ, అపిల్లను చక్కని జవాబు ఇచ్చే దాన్ని. ఇప్పుడైనా ఏమీ మించిపోలేదు. నే నా పిల్ల తిక్క అణుస్తాలే."

మరునాడు సోమూ సరిగా పదింటికి స్కూలుకు వెళ్ళాడు. కమల కనపళ్లేదు. కమల సఖులిద్దరు మాత్రం సోమూను చూచి నవ్వారు. చేయెత్తి నమస్కారం కూడా చేశారు.

ఆ మర్నాడు కూడా కమల రాలేదు.

ఈ మధ్యలో భార్య తంతి చూచుకొని సోమూ అన్న చత్రానుండి వచ్చాడు. కమల ఉత్తరంలో ఉన్న చిరునామాను బట్టి వదినె నాయనమ్మలు ఒకసారి కమల యింటికి కూడా పోయివచ్చారు.

ఫలితం, సోమూఅన్నా కమలమామా యాదృచ్ఛికంగా బజారులో కలుసుకుని గంటన్నరసేపు మాట్లాడారు.

తరువాత ఒక రోజున కాలేజీలో కమలసోమూకు కనపడి చీరచెరగు నెత్తిమీదికి లాక్కోబోయింది. బ్రూచ్ పెట్టి ఉండటంవల్ల చెరగు నెత్తిమీదికి రాలేదు. విధిలేక ముఖం మాత్రం క్రిందికి వంచుకొని అత్యంత నిరీహ ప్రాణివలె కూలబడింది. సోమూ చూడనట్టుగా పెన్సలు చెక్కుకుంటున్నాడు.

ఆఖరుకు, ఒక సామాన్య స్త్రీని వశపరచుకోవటానికై ఒకనాటి సాయంకాలం టాక్సీ ఎక్కి, దుర్యోధన వేషంతో (పెళ్ళికొడుకై) బంధుమిత్రాది సైన్యాలను సమకూర్చుకొని, కమలమామ హారాణ్ ముజుమ్‌దారు యింటిని శ్రీయుత సోమేణ్ చంద్ర సమద్దార్ ముట్టడించాడు.

# వెల్లువ

కాకి అరిస్తే కోయిల కూసిందని భ్రమపడే ప్రాయాన—అంటే ఇరవైరెండో యేట బేచా రాంబాబు లవంగమంజరిని వివాహంచేసుకున్నాడు.

అప్పుడు భవిష్యత్తును గురించి ఎవ్వరూ ఆలోచించలేదు. వరవధువులూ, వారి చుట్టపక్కాలూ, అందరిదృష్టీ వర్తమానముమీదే వున్నది. బేచా రాంబాబు చూసింది—ఆలిచిప్పలవంటి రెండుకళ్ళూ, ముత్యపు ముక్కరా, తాంబూల సేవనమువల్ల కొంచెంగా ఎర్రబడ్డ మొక్కజొన్న గింజలవంటి పలువరుసా. లవంగమంజరి చూసింది—పాలూపెరుగూ కొంచెం అధికంగా సేవించటంవల్ల బొద్దుగా పెరిగిన దేహమూ, ఈగవాలితే జారిపోయే టట్టుగావున్న మెడా, వర్షాకాలపు కారుమేఘమువలె శ్యామలముగావున్న ఒక దేవమూర్తిని. మంజరి తల్లి చూసింది—అడిగికూడా పెట్టించుకు తింటంచేతకాని గంగిగోవువంటి పిల్లవానిని. ఇక లవంగమంజరి తండ్రి చూచింది—బేచారాంబాబు తండ్రి కేనారాంబాబు కలకత్తాలో అద్దెకు యిచ్చిన మూడుమేడలూ, సుందరవనంలోవున్న మూడువందల యెకరాల మాగాని భూమీ.

వివాహం మహావైభవంగా జరిగిపోయింది—ఆ రోజు జ్ఞాపకంవస్తే ఇప్పుడుకూడా బేచారాంబాబు

గ్రామఫోనుమీద ఫీలురాగపు సన్నాయి రికార్డు పెట్టి స్తబ్ధంగా వింటోన్నట్టే—వంటయింటి వరండాలో కూర్చుని వంకాయ తరుగుతూవున్న లవంగ మంజరి వేలు కోసుకొంటుంది.

నదిలో వెల్లువ తగ్గింది. నీరుకూడా ఇంకినట్టు తీసింది. రెండువైపులా సోపానపురాళ్ళు వూడిపోయి అస్థిపంజరము వలె కనపడుతూ ఒకటి తర్వాత ఒకటి మెట్లన్నీ బయటపడ్డవి. కాని ఇలా ఎందుకయింది?

దీన్నిగురించి ఎక్కువ వివరాలు చెప్పటం ఈ కథకు సంబంధించిన విషయం కానప్పటికీ, కొంచెంగా సూచించి వదలితే—ఈ నశ్వర జగత్తులోని నశ్వర తర ప్రేమ మరీచికలనుంచి పాఠక పాఠికలు ముందు సావధానులు అవుతారని చెప్పుతున్నాను.

సారె గదినుంచే ఆరంభిద్దాము!

వెన్నెల రాత్రి. ఇంటి ముంగిలిలో వున్న వేప చెట్టు కొమ్మమీద కూర్చుని, నిశాచరి గుడ్లగూబ పక్షి భాషలో తన ప్రేయసిని పిలుస్తోంది. బేచారాం బాబు మేనత్త వరండాలో నిలబడి 'ఘూత్—ఘూత్' అంటూ దానిని వెళ్ళగొట్టటానికి ప్రయత్నిస్తోంది. మేడ మూడో అంతస్థు గదిలో పుష్పశయ్య మీద పండుకొనివున్న బేచారాంబాబు వీపు గోక్కుంటూ నవవధువు రాకకోసం ఎదురు చూస్తున్నాడు. మెట్ల మీద అణచుకొంటూన్న నవ్వూ, తేల్చివేస్తున్నట్టుగా అడుగుల చప్పుడూ, తాళపుచెవుల ఘుంకా

రమూ వినపడుతూవుంది. క్రమంగా అన్నిశబ్దాలూ శాంతించినవి. రెండు నిముషాల లోపలనే మెట్ల వాకిలిదగ్గర గాజులు గలగలమన్నవి. తర్వాత చేత్తో మల్లెపూలదండ పట్టుకొని నవవధువు లవంగ మంజరి గదిలో ప్రవేశించింది; ఆ క్షణంలోనే బేచారంబాబు నిద్రపోయి గురక పెట్టసాగాడు! భర్త నిద్రపోవటం చూచి లవంగ మంజరి చప్పున లైటు ఆర్పివేసింది.

"ఇదేమిటి! దీపం ఎందుకు తీసేశా?" బేచారం బాబు ఆదుర్దాగా అడిగాడు.

"మీరు నిద్రపోతున్నారుగా?" మంజరి అంది.

బేచారంబాబు పాపం చిక్కులోపడ్డాడు—"నిద్ర కాదు, కాస్త మత్తువచ్చింది. దీపం వెలిగించూ, కాస్త నిన్ను చూడాలి!" అన్నాడు.

మంజరికి అప్పుడు పదిహేడోయేడు. Lamb's *Tales from Shakespeare* చదివి పూర్తిచేసింది. మందహాసం చేస్తూ అన్నది—"ఇప్పుడు యింకా ఏమి చూస్తారు? పగలంతా కిటికీలోంచి పొంచి పొంచి చూసింది చాలదూ!"

బేచారం అన్నాడు—"ఇంకోసారి చూస్తాను!"

"చూడండి!" అంటూ మంజరి స్విచ్ వత్తింది.

ఆ పరికాశవంతమయిన గదిలో పుష్పశయ్య మీద కూర్చుని, ఇద్దరూ ఒకరి కొకరు చెప్పుకు న్నారు—ఈ ప్రపంచంలో యింకేమి లేకపోయినా ఒకరి నొకరము ప్రేమించుకొని జీవిద్దాము. ఇల్లు

లేకపోతే అరణ్యానికి పోయీ, అన్నం లేకపోతే కంద మూలాలు తినీ జీవనం గడుపుదాము. తుండుగుడ్డ లేకపోతే లవంగమంజరి తన కేశజాలంతో బేచారాం పాదాలు తుడుస్తుంది. పారాణి లేకపోతే బేచారాం తన హృదయంనుంచి రక్తంతీసి లవంగమంజరి కాళ్లకు రాస్తాడు. బేచారాంబాబుకు ఒకటే ఆటంకము—ఎమ్. ఏ. పాసు కావాలి. లేకపోతే తండ్రి కూకలు వేస్తాడు. బేచారాంబాబు వంటి భర్తను పొందినందు వల్ల—తన నారీ జీవితం సార్థకమైందని లవంగమం జరి చెప్పింది. తను గనుక మెట్రిక్యులేషను పాస యితే, ఇక యీజీవితంలో తనకేకోరికా వుండదట.

చెట్టునున్న పళ్లన్నీ పక్వానికి రానట్టు, జీవితం లోని కోరికలన్నీ నెరవేరవు. లవంగమంజరీ బేచా రాముల కోరికలు భగవంతుడు నెరవేరనీయ లేదు. మెట్రిక్యులేషను పరీక్ష సరిగ్గా పదిహేను రోజులున్న దనగా బేచారాంబాబు మేనత్త, మేనల్లుని తల చేతితో స్పృశించి, ఆశీర్వదిస్తూ ఈ లోకంతోవున్న సంబంధం తెంచుకుంది. తండ్రిగారింట్లో జామెట్రీ ప్రాబ్లము సాల్వు చేస్తున్న మంజరి యీ కబురు విని భోరున ఏడ్చింది. రెండో రోజున మామ కేనారాం బాబు కోడలిని తీసుకు పోవటానికి వచ్చాడు. లవంగమంజరి పుస్తకాలన్నీ పెట్టెలో సర్ది ఏడుస్తో మేనత్త వదలిపెట్టి పోయిన స్థానాన్ని ఆక్రమించు కోటానికి అత్తగారింటికి వచ్చింది.

దహనక్రియలూ, శ్రాద్ధమూ, బ్రాహ్మణ భోజనమూ, బీదలకు అన్నదానమూ, చివరకు పరామర్శ చేయటానికి వచ్చిన చుట్టాలను సాగనంపటమూ జరిగిన తరువాత లవంగమంజరికి పరీక్ష సంగతి జ్ఞాపకం వచ్చింది. పరీక్ష లయిపోయి అప్పటికి వారం రోజులకు ఎక్కువైంది. మంజరి తన గదిలో కూర్చుని దుఃఖించ సాగింది. బేచారాంబాబు వెనగ్గా వచ్చి అత్యధిక ప్రేమావేశంతో కుర్చీ సమేతంగా కౌగలించుకొని ఓదార్చాడు—“చింతించకు! నేను నిన్ను స్వయంగా చదివించి వచ్చే సంవత్సరం మెట్రిక్యులేషను పరీక్ష పాసు చేయించుతాను.”

మంజరి కళ్ళు తుడుచు కుంటూ అన్నది—“ఈ సంవత్సరం నాకు స్కాలర్ షిప్ వచ్చేది.”

బేచారాంబాబు అన్నాడు— “వచ్చే సంవత్సరం మెడలు వస్తుంది!”

పతిప్రేమకు ముగ్ధురాలై లవంగమంజరి ఇక పరీక్ష సంగతే మర్చిపోయింది. అనేక రకాల ఆటంకాలవల్ల ఆ సంవత్సరం బేచారాంబాబు కూడా ఎం. ఏ. తప్పాడని వేరుగా చెప్పనక్కరలేదు.

పరీక్షా ఫలితాలు ప్రకటింపబడ్డరోజున బేచారాంబాబు తండ్రిమొగాటకు పోలేదు. చల్లగా రిక్షా ఎక్కి తిన్నగా బాగ్ బజారులోవుండే అత్తగారింటికి వెళ్లాడు. లవంగమంజరి అప్పుడు మేడమైన రేలింగ్సు మీద మోచేతులుపెట్టి ప్రక్కయింటి కిటికీవైపు

చూస్తూ ఏదో మాట్లాడుతూ వుంది. భర్త పదశబ్దం విని తలతిప్పి చూచి అడిగింది. "ఫలితాలొచ్చాయా?"

బేచారాంబాబు అన్నాడు—"తప్పాను."

మంజరి ముఖం వాడిపోయింది. అన్నది—"ఎన్ని కష్టాలు వచ్చాయి! లేకపోతే మీలాంటి విద్యార్థి—"

బేచారాంబాబు అన్నాడు—"అది కాదు కారణం. నీవు పరీక్షకు కూర్చోనప్పుడు నేనెట్లా పాసవుతాను! మనమిద్దరం అభిన్నులం కదూ? అందుకనే —"

భర్తగారి పత్నీప్రేమకు లవంగమంజరి ముగ్ధురాలయింది. ఆమె చకిత దృష్టితో దగ్గరలోవున్న ఇండ్ల కిటికీలూ, మిద్దెలూ ఒకమాటు తేరిపారచూచి భర్త వక్షస్థలంలో తలవాల్చింది.

తర్వాత ఇద్దరూ మిద్దెపైన కూర్చుని—వచ్చే సంవత్సరం ఇద్దరమూ ఒక్కమాటే పాసు అవుదామని ప్రతిజ్ఞ చేసుకున్నారు. ఇందుకోసం కాళికాదేవికి రెండుజోళ్లు మేటలు బలియివ్వవలసి వచ్చినా యిష్టమే. మంజరి తనసొంత ఖర్చుల్లోంచి డబ్బు మిగిల్చి మేటలు కొంటుంది.

పరీక్షాఫలితం విని కేనారాంబాబు కొడుకును ఏమీఅనలేక. కోడలునుమాత్రంపిలిచి అన్నాడు—"నీవు కొంచెం కనిపెట్టివుండు అమ్మాయీ! మూడో అంతస్తులో వాడు చదువుకొంటూ వుంటాడు; నీవు రెండో అంతస్తులోకూర్చుని ఇంటిపనులు చూస్తో కాస్త పహరాకూడా యిస్తూవుండు, తెలిసిందా?"

లవంగమంజరి మునిపళ్లతో పెదవి బిగబట్టి నవ్వును ఆపుకొంటూ తలవూపింది.

*　　*　　*

ఇందువల్లనే బేచారాంబాబు గృహస్థుడై కూడా సన్యాసిగా వుండవలసి వచ్చింది. ఆయన మూడో అంతస్తులో వానప్రస్థం అవలంబించి అధ్యయనంలో నిమగ్నుడయాడు. కాని స్వభావదోషం ఎక్కడకు పోతుంది? ఒక్క పేజీ చదివాడో లేదో మెట్లవైపు చూసి పిలుస్తాడు—"ఇదిగో! వింటున్నావా?"

లవంగమంజరి రెండో అంతస్తునవుండే జవాబు ఇస్తుంది—"ఆఁ, వింటున్నాను!"

"అరికాళ్ళు కాస్త వత్తిపో, బాగా నిద్రవస్తున్నది."

మంజరి అంటుంది "మామగారింట్లోనే వున్నారు!"

తండ్రి ఇంట్లోనే వున్నాడని వినేవరకు బేచారాం బాబు నిద్ర మాయమైపోతుంది. ఇక తారస్వరంలో పదినిముషాల వరకు చదివి మరల పిలుస్తాడు— "ఇదిగో, వింటున్నావా? నాన్నగారు బయటకెళ్ళారా?"

భర్తగారితో మాటిమాటికీ అబద్ధం ఆడటం మహాపాపమని లవంగమంజరి అంటుంది "ఆఁ, ఎందుకూ?"

"మేడమీద కాకి ఒకటి మహా గోల చేస్తున్నది. కాస్తవచ్చి తోలిపో రాణీ!"

బేచారాంబాబురాణి రెండో అంతస్తులో వుండే కాల్పనిక కాకాన్నుద్దేశించి 'హుష్, హుష్' అంటుంది. బేచారాంబాబు కాసేపు చెవులు రిక్కించి విని

మరల కేక వేస్తాడు—"ఇదిగో, ఈకిటికీ కాస్త వేసిపో చాలాగాలి వస్తున్నది.!"

లవంగమంజరి జవాబిస్తుంది "రావటానికి వీల్లేదు. హిస్టరీ చదువుకొంటున్నా!"

బేచారాంబాబు ఇకేమీ మాట్లాడడు. దిండు హృదయం క్రిందికి లాక్కొని పండుకొంటాడు. ఇటు లవంగమంజరి ఒక చెవి క్రింద కేనారాం కూర్చుండే గదివైపుకూ రెండో చెవి పైన బేచారాంబాబుండే మూడో అంతస్తు గదివైపుకూ పెట్టి, రెండో అంతస్తులో వుండి సిపాయి విద్రోహ కారణాలు కంఠస్థం చేయటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తోవుంటుంది. అఖరుకు విసుకుపుట్టి మెట్రిక్యులేషన్ హిస్టరీ ఆఫ్ ఇండియా పాన్‌దానుమీద విసరికొట్టి క్రిందినుంచి ఎక్కివచ్చే మెట్ల తలుపుకు గొళ్ళెం పెట్టి, మూడో అంతస్తులో ప్రవేశించి బేచారాంబాబు తల నిమురుతూ అడుగుతుంది—"ఏమండీ, కోపం వచ్చిందా?"

బేచారాంబాబు తల ఎత్తకుండానే గంభీరంగా అంటాడు—"పో, హిస్టరీ చదువుకో—చచ్చినవాళ్ళ పేర్లు వల్లించు!"

లవంగమంజరి బేచారాంబాబు దిండుమీద తల పెట్టటానికి మాత్రం చోటు చేసుకొని అంటుంది—"ఇక చేయను. ఈసారికి క్షమించండి!"

బేచారాంబాబు విధిలేక క్షమిస్తాడు. తర్వాత యిద్దరూ ఒక ఝాముపరకూ మాట్లాడుకొంటారు.

ఆ సంభాషణ డాక్ట్రిన్ ఆఫ్ లాన్సుకుగానీ కోబాల్ట్ మినిస్ట్రీకిగానీ ఏమాత్రమూ సంబంధించివుండదు. ఈ సంభాషణ తెగీతెగకముందే రెండో అంతస్తు మెట్ల తలుపు కదిలిన చప్పుడూ, మృదుకంఠంతో 'అమ్మాయీ!' అనే పిలుపూ వినపడుతుంది.

లవంగమంజరి దడబిడలాడుతూ దిగివచ్చి, చేతికి అందికలో వున్నవల్లా—అంటే సూదీ-దారం, పాన్ దానూ, నేతి తప్పేలా-వగైరాలు ఎడమచేతితో తీసుకొని కుడిచేతితో గొళ్లెం తీస్తుంది. కేనారాంబాబు నవ్వుతూ ప్రశ్నిస్తాడు—"బేచూ చదువుతున్నాడా?"

లవంగమంజరి అంటుంది—"ఊఁ."

కేనారాం అంటాడు—"సరే, ఇక స్నానం చేసి భోంచేయమను! ఎక్కువ చదవటం కూడా మంచిది కాదు! పోయి కాస్త పిలువూ."

లవంగమంజరి వెళ్ళి బేచారాంబాబును పిలుచుకు వస్తుంది. బేచారాంబాబు చేతితో కణతలు పట్టుకొని దిగివస్తాడు. కేనారాం అంటాడు—"తల తప్పకుండా చిటపట లాడుతుంది. ఒక్కసారిగా ఎక్కువసేపు చదివితే తలనొప్పి పెట్టదూ? కాసేపు చదువు; కాసేపు అటూ యిటూతిరుగు—మేడమీద."

బేచారాంబాబు 'అలాగే'నని స్నానాగారంలోకి పోతాడు.

*   *   *

మార్చిలో మెట్రిక్యులేషనుకూ, జూలైలో ఎం. ఏ. కూ పరీక్ష జరుగుతుంది. డిశంబరులో అకస్మాత్తుగా ఒక రోజున మంజరి బేచారాంబాబు వద్దకు వచ్చి అన్నది"ఈసారి కూడా నేను పరీక్షకు కూర్చోలేను."

బేచారాంబాబు సంకుచితుడై అన్నాడు—"ఏవిధంగా నన్నా కూర్చుంటానికి వీలుందేమో చూడూ!"

మంజరి వ్రేళ్ల కనుపులు లెఖ్ఖవేసి అన్నది—"ఎట్లానూ వల్లకాదు!"

బేచారాంబాబు దిక్కుతోచక "అయితే—" అని, తలగోక్కొంటూ పెన్సిలు కొనుక్కోవటం కోసం బజారుకు వెళ్ళాడు.

మెట్రిక్యులేషను పరీక్ష కొద్దిరోజు లున్నదనగానే మంజరికి అస్వస్థత వచ్చింది. పరీక్షలయ్యాక చాలారోజులకు బేచారాంబాబు కరుణాపూరిత మధురస్వరములో మంజరితో అన్నాడు—"ఈసారి పరీక్షకు కూర్చున్నట్లయితే నీకు తప్పకుండా మెడలు వచ్చేది."

లవంగమంజరి పొత్తిళ్ళలో పెట్టివున్న నవజాత కన్యను బేచారాంబాబుకు అందిస్తో—కటుస్వరంతో అన్నది—"ఇచ్చారుగా యీ మెడల్!"

బేచారాంబాబు చాలా తప్పుచేసిన వానివలె తలవంచుకొని తప్పుకుపోయాడు. కొన్నిదినాల వరకు మళ్ళా పరీక్షసంగతి రానేలేదు. ఆరు మాసాలయ్యాక ఒకరోజున బేచారాంబాబు నవ్వుతూ వచ్చి అన్నాడు—"నేను సెకండు క్లాసులో పాసయ్యాను!"

కుమార్తె చంకను పుస్తకాలు పెట్టుకొని బ్రాహ్మో గరల్సు స్కూలుకువస్తూ పోతూవుంది.

* * * *

జీవననదికి వెల్లువ తీసే సమయాన మన కథలో ఒక ఘటన జరిగింది.

కిస్‌మిస్ సెలవలు. సిమ్లా, బొంబాయి, వాల్తేరు, ఢిల్లీ, కాన్పూరు మొదలగు పట్టణాలనుంచి లవంగ మంజరి బాల్య స్నేహితురాండ్రు తమ భర్తల వేతనానుసారం మోటూ-తాటా శరీరాలతో కలకత్తా తిరిగి పోవటానికి వచ్చారు. ఆ సంవత్సరం కలకత్తాలో అఖిలభారత శిల్ప ప్రదర్శనం జరుగుతూ వున్నది. పెద్దపెద్ద హోటల్సులో 'చోటులేదు' అనే నోటీసులు వ్రేల్గగట్టి వున్నాయి. కలకత్తా మార్కెట్టులో మూర్షిదాబాదు పట్టుచీరెల ధర, రూపాయికి రెండు అణాలు పెరిగింది.

పైశిల్ప ప్రదర్శనంలో లవంగమంజరి తన అమ్మాయిని వెంటబెట్టుకొని తిరుగుతూవుండగా దాదాపు మంజరి ప్రాయమేగల స్త్రీ ఎదురుపడి ప్రశ్నించింది— "దీదీ నీవు లవంగమంజరివి కావూ?"

ఆగంతుకి లంగామాదిరి ముడుతలుపడ్డ పార్శీ చీరె కట్టుకొని, కాళ్ళకు స్లిప్పర్లు వేసుకొనివుంది. సామాన్యంగా వేశ్యలే ఈమాదిరి దుస్తులు ధరిస్తూ వుంటారు. మంజరి మొదట ఇలానే ఊహించింది. కాని మరుక్షణానే తనస్మృతిపటము మీదికి ఒక

బాల్యకాలపు మూర్తిని తెచ్చుకొన్నది. ఆమూర్తి చాల బక్కపలచగా వుండేది. ఈ యెదుటవున్న మహిళ బాగా బొద్దుగావుంది. అందుకని మంజరి సందిగ్ధంలో పడి ఏమనాలో నిశ్చయించు కోలేక పోయింది. ఆగంతుకి నవ్వుతూ అన్నది— "దీదీ, నన్ను గుర్తుపట్టలా? నేను మృణాళినిని!"

మంజరికూడా నవ్వుతూ అన్నది—"కాదు చెల్లీ! నీవు చాలా లావు—"

మృణాళిని—"వారుకూడా యిదే అంటున్నారు; నీవే చెప్పు దీదీ, నేనేమిచేసేది?"

తరువాత మృణాళిని పదిపన్నెండు గజాల పట్టు రుమాలతీసి పచ్చిగడ్డిమీద పరిచింది. సఖులిద్దరూ దానిమీద కూర్చుని సంభాషణ ప్రారంభించారు.

కాసేపట్లోనే మృణాళిని సఖి కమలినీ, కమలిని ప్రాణం పుష్కరిణీ, పుష్కరిణికి ఆధారం నిర్ఝరిణీ, నిర్ఝరిణి చెలి పూజారిణీ ఇత్యాదులు అర్ధడజను స్త్రీలు వచ్చి సఖీత్వ సూత్రముతో గుచ్చబడిన మాలవలె మంజరి చుట్టూ కూర్చున్నారు. వారి పతిదేవులు దూరంగావున్న వటవృక్షంక్రింద నిలబడి, ఊర్ధ్వ నేత్రాలతో, కొమ్మలు లెక్కిస్తూ. సభాభంగం కోసం ప్రతీక్షిస్తున్నారు. అరఝామురాత్రి గడిచాక కిలకిల నవ్వులతో సభ లేచింది. అక్కడ కూడిన సఖులలో లవంగమంజరే కలకత్తావాసిని కావటంచేత మరు దినం మూడోఝామున, సఖుల నందరినీ తనయింటికి

రమ్మని ఆహ్వానించి, వారిదగ్గర సెలవుతీసుకుంది.

ఇంటికివచ్చే దోవలో మంజరి తనస్థితినిగురించి ఆలోచించిన కొలదీ తన సఖులందరిలోనూ తానే అభాగినినని అమెకు తోచసాగింది. ఆమె సఖులను వారి వారి భర్తలే వెంటబెట్టుకొని ప్రదర్శనానికి తీసుకువచ్చారు. మరి తనవెంట ఎవరు వచ్చారు? జగ్గూకోచ్‌వానూ, మహాదేవదర్వానూ, బుధువా సైసూ!

లవంగమంజరి మానసిక విలాపము పూర్తికాక ముందే బండి సింహద్వారములోనికి వచ్చి ఆగింది. బేచారాంబాబు అప్పుడు చాలా ఆదుర్దాతో ఈగదికీ ఆగదికీ తిరుగుతూ, వృందుండి క్షేమిదాసీని కసరు తున్నాడు—అది అమ్మగారివెంట ఎందుకు వెళ్లలే దని! మంజరిని చూడగానే అతను చాలా సంతోషంతో అన్నాడు—"వచ్చేశావే! నేను చాలా—"

మంజరి తన దుర్భాగ్యం సంగతి యింకా మరచి పోలేదు. మధ్యలోనే అంది—"రాకపోయినా బాగుండేది!"

బేచారాంబాబుకు యికే మంటానికి ధైర్యము చాలలేదు. అమ్మాయిని చాటుకు పిల్చి మెల్లగా అడిగాడు—"మీ అమ్మ పర్సు మర్చిపోయి వెళ్ళిం దనుకుంటా, కాదూ?"

"నాకు తెలియదు".—అని అమ్మాయి తుర్రున పారిపోయింది. బేచారాంబాబు క్రిందకు దిగివచ్చి

బండివాణ్ణి కనుక్కుంటే—గుర్రం గోపలో ఎక్కడా నఖరా చేయలేదని తెలిసింది. అయితే, మంజరి హఠాత్తుగా యీ రుద్రరూపం ధరించటానికి కారణం ఏమిటి?... ఎంత ఆలోచించినా అతనికి బోధపడక పోయేవరకు చప్పున భోంచేసి గుప్పున నిద్రపోయాడు.

మంజరి రుద్రరూపానికి కారణం మర్నాడు దానంతటదే బేచారాంబాబు కన్నులకు ప్రాతః కాలపు సూర్యునివలే ప్రత్యక్షమైంది.

బేచారాంబాబు అప్పుడు భోంచేసి నిద్రపోతు న్నాడు. అకస్మాత్తుగా మెట్లమీద కాళ్ళ చప్పుడూ, గాజుల గలగలా, పట్టుచీరెల పరపరా, మధుర హాస్యాల కలకలా విని త్రుళ్ళిపడిలేచి పక్కమీద కూర్చున్నాడు. మరుక్షణం—"రావే చెల్లీ, రావే!" "భలే! ఆ చీరె నీకెంత బాగా అతికింది!" "అది ఎన్ని నవర్సులదీ?" "మజూరి ఎంత తీసుకున్నాడు?" "ఈ రవ్వ ఎన్ని రతులు?" "మీవారు నిన్ను రానిచ్చా రూ?"—ఈమాదిరి విచిత్ర ప్రశ్నలు విని బేచారాం బాబు లవంగమంజరి గదిలో సఖీ సమ్మేళనము జరుగు తున్నదని గ్రహించాడు.

బయటికి వెళ్లాలంటే మంజరి గదికి మూడువైపుల గుండా తిరిగి వెళ్ళాలి. ఇటు బేచారాంబాబు తీరిక చిక్కనందువల్ల అయిదు రోజుల నుంచీ గడ్డం గీసు కోలేదు. అందుకని బయటికి రావడానికి సిగ్గుపడి పక్కమీదే కళ్ళు మూసుకు పండుకొని పక్క-

గదిలో, వివాహమూ-అత్తింటి కాపురమూ-నగలూ-కోకలూ—మొదలగు వాటిమీద జరిగే విమర్శన వినసాగాడు.

వింటూ వింటూనే బేచారాంబాబు ఒక గుడ్డి కునుకు వేశాడు. మంజరి ఉచ్చకంఠస్వరం విని హటాత్తుగా వారికి మెలకువ వచ్చింది. లవంగమంజరి చెప్పుతూ వుంది—ఇంట్లో మాస్టరును పెట్ట చదువు చెప్పించి, నీ భర్త కనుక నిన్ను పాసు చేయించాడు. నీ అదృష్టం. నాభర్తబోటి వారి పాలిట పడితే నీ చదువుకు పుట్టింట్లోనే సందు కొట్టేది. నాబోటిది ఇంకా ఏమి పరీక్షలు పాసవుతుంది!

బేచారాంబాబు గౌరవానికి భంగం కలిగింది. కోపంకూడా వచ్చింది. కోపం వచ్చినప్పుడు గ్రీకు వేదాంతి చెప్పిన ప్రకారం నూరువరకూ లెఖ్ఖ పెడతాడు. నేడుకూడా ఆపంథా అనుసరించాడు. కాని, వేయివరకు లెఖ్ఖపెట్టినా వారి కోపం తగ్గక పోయేవరకు యిక మిద్దెమీదకు పోయి పచారుచేయ సాగాడు. క్రమంగా సాయంత్రం అయింది. మంజరి అతిథినులు మోటార్లు ఎక్కి సెలవు తీసుకోవటం బేచారాంబాబు రక్తనేత్రాలతో మిద్దెమీద నుండే చూశాడు. తర్వాత నెమ్మదిగా కాళ్లీడ్చుకొంటూ క్రిందకు దిగివచ్చాడు. లవంగమంజరి వచ్చి అడిగింది —"కాస్త భోంచేస్తారా?"

బేచారాంబాబు అన్నాడు "అఖ్ఖర్లా."

తర్వాత క్రిందికిదిగిపోయి ఒక వుత్తరం వ్రాసి క్షేమిద్వారా లవంగమంజరికి పంపాడు. మంజరి భామలు చిట్లించుకొని చదివింది—

'నీవు నన్ను అవమానం చేశావు. మాష్టరును పెట్టి చదువు చెప్పించి నిన్ను పరీక్ష పాసుచేయించలేదని స్త్రీలందరియెదుటా నన్ను రట్టుచేశావు. రేపే యీ ఆసంగతి వాళ్ళభర్తలూ,వాళ్ళభర్తలవల్ల వారి బంధు మిత్రులూ వింటారు. మొదట కలకత్తాలోనూ, తర్వాత ఢిల్లీ, ఆగ్రా, డెహరాడూన్, సిమ్లా, కాన్పూరు, బొంబాయి, మద్రాసు మొదలగు మహా పట్టణాల్లో నాఅపకీర్తి వ్యాపిస్తుంది. నేను భార్యను హింసిస్తున్నాననీ, ఇచ్ఛాపూర్వకంగా ఆమెను బర్బర స్త్రీనిగా తయారు చేశాననీ ప్రజలందరూ తలుస్తారు. ఈలాంటి పరిస్థితులలో నేను నీకు పతిగావుండటానికి ఏమాత్రమూ తగను. కాబట్టి, నేటినుంచి నేను డ్రాయింగురూంలోనే పండుకుంటాను;క్రింది గదిలోనే భోజనాదికాలు నిర్వర్తించుకొంటాను.

ఇట్లు,
శ్రీ బేచారాం.'

లవంగమంజరి కళ్ళు ఎర్రబడ్డవి. అన్నది—"ఛీ ఛీ!"

భోంచేసినతర్వాత బేచారాంబాబు డ్రాయింగు రూంలో పండుకొని, నల్లులు కుట్టటంవల్ల నిద్రపట్టక అటూయిటూ పొర్లుతున్నాడు. ఇంతలో క్షేమి ఒక వుత్తరం తీసుకునచ్చి యిచ్చింది. బేచారాంబాబు

త్రిలోచన కవిరాజు.

చదివాడు—

'తమవుత్తరం అందినది. సంగతులన్నీ తెలిసినవి. మీపిల్లల లాలనపాలనలోనే నాజీవితమంతా వ్యర్థమైంది. పైగా మీరే నన్ను కోప్పడుతున్నారు! నేను రేపటినుంచీ మీవద్ద వుండను. ఈవుద్దండపు పిల్లలను ఎలా సంబాళించుకొంటారో చూస్తాను. దంతాలు వున్నంతవరకూ వాటివిలువ ఎవరికీ తెలియదు. ఇట్లు—

శ్రీమతి లవంగమంజరీదేవి.'

వుత్తరం చదవగానే బేచారాంబాబు తల కొంచెం తిరిగింది. కాని వెంటనే తిప్పుతెలుసుకొని ఖుషీతో అన్నాడు—"భేష్!"

రాత్రి అంతా నానావిధములైన దుశ్చింతలవల్లనూ, పాపిష్టినల్లుల కాట్లవల్లనూ—నిద్రపట్టక తెల్లవారు ఝామున బేచారాంబాబు కన్నంటింది. అంటి కూడా ఎక్కువసేపు కాలేదు, చిన్నబ్బాయి చీత్కారం విని మెలకువ వచ్చింది. చిన్నబ్బాయి వచ్చి చేయి పట్టుకొని లాగుతూ అడుగుతున్నాడు— "ఆకలి అవుతోంది నాన్నా!"

నిద్రచాలక మూసుకుపోయిన కళ్ళను బలవంతాన కొంచెం తెరచి బేచారంబాబు అన్నాడు—"వేధించబోకురా నన్ను. మీ అమ్మదగ్గరకు పో!"

కుఱ్ఱవాడన్నాడు—"అమ్మ లేదుగా."

తేలుకుట్టిన వానివలె ఉలికిపడి బేచారంబాబు

పక్కమీద కూర్చున్నాడు. గత దినం జరిగిన ఘటన లన్నీ అతనికి ఒక్కసారిగా జ్ఞాపకంవచ్చాయి. త్వరగా లేచి రెండోఅంతస్థుకు పోయి చూచాడు—ఇంటి ఆవిడ లేదు. పెద్దమ్మాయి మాత్రం కూర్చుని డ్రాయింగు వేసుకొంటూవుంది. పెద్దబ్బాయీ చిన్న మ్మాయీ కలిసి నాయనగారి పాత బూట్లన్నీ పోగు చేసి—మల్లెపూవులవలె తెల్లగావున్న మంజరి శయ్యా మీద—వాటితో గోపురం కొట్టటానికి ప్రయత్నిస్తు న్నారు. బేచారాంబాబును చూడగానే పెద్దమ్మాయి అడిగింది— "ఇవ్వాళ స్కూలుఫీజు యివ్వ నాన్నా! మాటమాటికి అడగటం బాగోలేదు. ఇవ్వాళ జీతం తీసుకోనిగాని కదలను!"

బేచారంబాబు అడిగాడు—"మీ అమ్మ—"

పెద్దమ్మాయి మధ్యలోనే అంది—"అమ్మ యిచ్చి పోలేదు. మీ నాన్నాను అడిగి తీసుకోమని చెప్పింది. ఇదిగో, మీ ఓటిపెట్టె చెవి అట్టే పెట్టి పోయింది." అని ఒక తాళపుచెవి తండ్రిగారి మీదికి విసరివేసింది.

బేచారాం బాబడిగాడు— "ఎక్కడికి వెళ్ళింది?"

పెద్దబ్బాయి జవాబిచ్చాడు—"బాగ్‌బజార్! మరి చెప్పిపోయిందీ—మీరు గనుక అటు ముఖంపెట్టితే—"

పెద్దమ్మాయి వాణ్ణి బెదరిస్తూ అన్నది—"నోరు మూసుకోరా వెధవా! నాన్నగారికి అటువంటి మాటలు చెప్పవచ్చా?— అదికాదు నాన్నా, అమ్మ చెప్పిపోయిందీ—మీరు గనుక బాగ్‌బజా

రుకు వెళ్లేటట్టయితే అమ్మకు చాలా కష్టంగా వుంటుందట. తర్వాత కలకత్తా వదలి ఎక్కడికైనా వెళుతుందట. కాశీ అయినా పోవచ్చు, రామేశ్వరం అయినా పోవచ్చు."

చిన్నమ్మాయి అంది—"అమ్మంది—నేను యిహ మీ అమ్మను కాను. మీకు ఇంకో కొత్త అమ్మ వస్తుంది. చెప్పు నాన్నా, ఎప్పుడొస్తుందీ?"

బేచారాంబాబు అన్నాడు—"హుం! అట్లాగా!"

తర్వాత శాలువా పైన వేసుకొని బజారికి పో బోతూవుండగా పెద్దబ్బాయి అడిగాడు—"మా కే దన్నా తింటానికి తెచ్చిపెట్టు నాన్నా! నాకు పూరీలూ—చిన్నమ్మాయికి బిస్కట్టులూ—"

పెద్దఅమ్మాయీ చిన్న అబ్బాయీ ఏక కంఠంతో అన్నారు—"మాకు వేడి వేడి బజ్జీలు."

బేచారాంబాబు కొంచెం గాభరా పడి అన్నాడు —"క్షేమీని పిలువూ?"

"అదికూడా లేదు నాన్నా!" పెద్దమ్మాయి అంది.

"ఎక్కడికి వెళ్లింది?"

"ఉదయాన్నే అమ్మదగ్గర సెలవు తీసుకొని అమ్మ బండే ఎక్కిపోయింది."

బేచారాంబాబు ఇదంతా ఒక పెద్ద కుట్రని గ్రహించాడు.—"హూం, అందాకా వచ్చిందీ!— ఠాకూర్?" పిలిచాడు.

వంట బ్రాహ్మడు గణపతిఠాకూర్ వచ్చి విన

యంగా అడిగాడు—"కాబేజీ కూరలో మిరపకా
యలు వేయమంటారా, వద్దంటారా?"

బేచారాం—"వద్దు—నీవు బజారుకు పోయి
పిల్లలకు, ఏమైనా, తింటానికి తీసుకురా."

గణపతి అన్నాడు—"ఇప్పుడింకా ఏమి తింటారు
బాబూ ! పది ఘంటలేగా అయింది. ఇదివరకు ఒక
సారి తిన్నారు."

బేచారాంబాబు బుభుక్ష చతుష్టయం వైపు
కోపంగా చూస్తూ అడిగాడు—"తిన్నారూ?"

పెద్దమ్మాయి అంది—"కొద్దిగా."

బేచారాం—"ఇప్పటికి వూరుకోండి, మధ్యా
హ్నం బాగా తిందురుగాని!"

ఆరోజునుంచే బేచారాంబాబు గృహకార్యాల్లోకి
మనస్సును పోనిచ్చాడు. అన్ని వ్యవహారాలూ చక్క
జేసుకొని, అబ్బాయిలూ అమ్మాయిలూ భోంచేసే
సమయం, వారివారి పరిమాణం—అంతా టైంటే
బిలు వ్రాసి వంటయింటి తలుపుకు అంటించాడు.
తర్వాత వంటవానినీ, నౌకర్లనూ పిలిచి చెప్పాడు—
"పనులన్నీ సక్రమంగా జరగాలి. ఇంటిఆవిడ లేదని
కాస్త అతితెలివి చూపించబోతారేమో—నా
దగ్గర అవేవీ సాగవు!"

రాత్రి బేచారాంబాబుకు కునుకు పట్టుతూ వుం
డగా చిన్నబ్బాయి వచ్చి అడిగాడు—"నాన్నా,
నాకు యర్రచొక్కా తొడగవూ?"

బేచారాంబాబుకు మత్తు వదిలింది. అన్నాడు—"రాత్రిళ్లు చొక్కా ఎందుకూ?"

చిన్నబ్బాయి అన్నాడు—"అది లేకపోతే నాకు నిద్రపట్టదు!"

బేచారాంబాబు అమ్మాయిని పిలిచాడు.

అమ్మాయి అంది—"నా చెవి దురదగా వుంది నాన్నా!"

బేచారాంబాబన్నాడు—"సరే."

ప్రొద్దున్నే లేచి డ్రాయింగు రూంలో కూర్చుని వుండగా జగ్గూకోచ్‌వాన్ వచ్చి గుర్రందానా అంట టం లేదని చెప్పాడు.

బేచారాంబాబన్నాడు—"డాక్టరుకు చూపించు."

జగ్గూ వెళ్ళిపోయాడు—సాయంత్రం మళ్లీ వచ్చి గుర్రం గిలగిల తన్నుకొంటున్న ధన్నాడు.

బేచారాంబాబు చాకలి దగ్గరనుంచి ఇస్త్రీ గుడ్డలు లెఖ్ఖపెట్టి తీసుకొంటున్నాడు. నిర్వికార భావంతో ఆజ్ఞా పించాడు—"గుర్రాన్ని కసాయి దుకాణానికి తోలు."

మధ్యాహ్నం బేచారాంబాబు నిద్రపోతుండగా ఒక కాన్‌స్టేబులు చిన్నబ్బాయినీ చిన్నమ్మాయినీ చెరి ఒక రెక్కా పట్టుకొని హాజరై అన్నాడు—"ఈ పిల్ల లిద్దరూ మెయిన్ రోడ్డుమీద నిలబడి, ఏడుస్తూ బాగ్ బజారుకు దారి అడుగుతున్నారు."

బేచారాంబాబు కాన్‌స్టేబులుకు ఒకసావృలా యిచ్చి పంపాడు. అనుక్షణమూ పెరుగుతూ బస్తూ

తిరిగే కలకత్తా పట్టణంలో ఈ వుద్దండపు పిల్లలతో వుంటం చాలా అపాయకరమని భావించి, వెంటనే దర్వాన్ను పిలిచి టైమ్‌టేబిల్ కొనుక్కు రమ్మని హౌరాస్టేషనుకు పంపాడు.

టైంటేబిలుఅంతా తిరగవేసి, రైల్వే రూల్సులన్నీ చదివి బేచారాంబాబు ఏమి నిశ్చయించాడో అయనకే తెలియాలి. తక్షణం బజారుకువెళ్ళి హోమియోపతీ మందుపెట్టే, ఒకబుట్ట కమలాలూ, హోమియోపతీ చికిత్సా విజ్ఞానము (Materia Medica) పదకొండు సంపుటాలూ కొని సాయంత్రం యింటికి చేరుకునేవరకు రెండో అంతస్తుమీద గలభాగావుంది. పెద్ద మట్టిపాత్రలో రసగుల్లాలు ముందుపెట్టుకుని వీరి నలుగురుపిల్లలూ గోలచేస్తూ తింటున్నారు. బేచారాంబాబు స్తబ్ధుడై నిలబడిపోయి రసగుల్లాలు ఎక్కువగా తింటంవల్ల కడుపునొప్పివస్తే, నక్స్‌వామికా యివ్వాలా లేక పల్సెటిలా—అని ఆలోచించసాగాడు.

ఇంతలో అన్నయ్యతో పోటీచేయాలని చిన్నబ్బాయి ఒక్కసారే రెండు రసగుల్లాలు నోట్లో కుక్కుకొని గుక్క తేలవేశాడు. పెద్దమ్మాయి అరచింది—"చస్తావేమిరా—ఊసేయి, ఊసేయి!"

చిన్నబ్బాయి ఊ యనన్నట్టుగా తలవూపి అయిష్టతను కళ్ళు తిప్పుతూ వెల్లకిలా పడుకొన్నాడు. పెదనమ్మాయి బిగ్గరగా ఏడ్చింది. వెంటనే బేచారాంబాబు ప్రక్కనుంచి బయటకువచ్చి; పిల్లవాణ్ణి కొం

మీద పంచకోబెట్టుకొని, నెన్నెన నీళ్ళుచల్లి, విసన కర్రతో విసరసాగింది.

బేచారాంబాబు అడిగాడు—"నీ వెందుకువచ్చావ్?"

క్షేమీ అన్నది—"దొరసానిగారు పిల్లలకు రసగుల్లాలు పంపారు. అవే—"

బేచారాంఅన్నాడు—"హుఁ! అఖర్లా తీసుకుపో!"

రసగుల్లాలు తీసుకుపొమ్మనటం వినగానేచిన్నబ్బాయి బంతివలె లేచి కూర్చుని—"ఉహుఁ! అవి మావి," అని కుండెడు రసగుల్లాలలో మిగిలిన మూడురసగుల్లాలూ గుప్పిటపట్టి మెట్లదోవ పట్టాడు. బేచారాంబాబు కుండవంక వేలుచూపిస్తూ క్షేమీతో అన్నాడు—"ఊఁ! తీసుకుపో!"

క్షేమీ వెళ్లి పోయింది.

రాత్రి అంతా మేలుకొని బేచారాంబాబు చాలా తర్కవితర్కం చేసి—లవంగమంజరి లేకుండా ఈకలకత్తా పట్టణంలో, ఈతుంటరి పిల్లలనుపెట్టుకొని సంసారం నడపటం అపాయకరమని తేల్చుకున్నాడు. భవిష్యత్తును వూహించుకొని అతను చాలా త్రొట్రుపడ్డాడు.

మర్నాడు ఒక అట్ట చించి నాలుగు ముక్కలు చేసి—వాటిమీద పిల్లల పేర్లూ, చిరునామా, పరిచయం—వివరంగా వ్రాసి నలుగురు పిల్లల మెడల్లోనూ కట్టి బేచారంబాబు కేక వేశాడు—"మహాదేవ్ టాక్సీ తీసుకురా!"

పెద్దమ్మాయి అడిగింది— "మెళ్ళో అట్టకట్టడం ఎందుకు నాన్నా?"

బేచారంబాబు అన్నాడు— "యాత్రచేయటానికి పోతున్నాం కదూ. అక్కడ మీలో ఎవరయినా మాయిపోతే మెళ్ళో 'అట్టముక్క చూచి, మిమ్మల్ని ఈ యింట్లో వదలిపెడతారు. లేక రైల్లు టిక్కెట్టు కొని అందులో నేను—గ్రహించావా?... అప్పుడు రైల్వేవాళ్ళు నీమెళ్ళో యీ టిక్కెట్టు చూచి నీవెవ రయిందీ తెలుసుకుంటారు, తెలిసిందా?"

పెద్దపిల్ల తెలివిగలది. అంతా అర్థంచేసుకుంది! యాత్రకుపోతున్నామనే ఉత్సాహంలో చేతికి అడ్డం వచ్చిన గుడ్డలన్నీ మూటకట్టేసింది బేచారాంబాబు జగ్గూ తోడ్పాటుతో పడు పరుపులూ పదానుగు కంబళ్ళూ కలిపి ఒక చుట్ట చుట్టాడు. ఒక టాక్సీమీద సామానూ పరుపులూ వేసి జగ్గూను స్టేషనుకు పంపాడు. తర్వాత తన గదికి తాళంవేసి, మంజరిగదిని అలానే వుంచి మహాదేవదర్వాన్ను ఇంటికి కాపలా పెట్టి, సిద్ధిదాత గణేశుని జపిస్తో పిల్లల చేతులు పట్టు కొని రెండో టాక్సీ ఎక్కాడు.

బేచారాంబాబు టిక్కెట్టుతీసుకున్నది మధురకు కాని బంకీ బర్ద్వాన్ స్టేషనులో ఆగగానే చేతిలోవున్న న్యూస్ పేపరును గుప్పిటలో బిగించి అన్నాడు— "పెద్దమ్మాయి! ఇకమీరంతా దిగండి!"

చిన్నబ్బాయి అన్నాడు—"దిగరా అన్నాయి.

నాన్న సీతాభోగం కొనిపెడతాడు!"

పెద్దమ్మాయి అడిగింది—"ఇక్కడెందుకు దిగటం నాన్నా?"

బేచారాంబాబు గుప్పిట్లోవున్న పత్రిక పిల్లమీద వేస్తూఅన్నాడు—"చూడరాదూ చదివి. మధురదగ్గిర ఎలుకలు పడుతున్నాయి—అంతాపోయి ప్లేగులోపడి చస్తారాఏం? దిగండి, దిగండి—"

చిన్నబ్బాయి అదివరకే ప్లాటుఫారంమీద దూకి సీతాభోగం వాడిని పిలుస్తున్నాడు. బేచారాంబాబు మిగిలిన ముగ్గురనూ దించి తాను దిగాడు. ప్లాటు ఫారంమీద కాసేపు నిలబడి దాపులో ఆరోగ్యకర మైన ప్రదేశం ఏదైనా వున్నదా అని ఆలోచించాడు. ఉత్తరపాడా జ్ఞాపకంవచ్చింది. అక్కడే గంగవడ్డున వీరినాన్నగారు కట్టించిపోయిన బంగళా, చుట్టూ ఆరా మవాటికావుంది. ఇంతలో డౌన్ పాసింజరు వచ్చి ఆగింది. తత్తరబిత్తరగా ఒకవీసె సీతాభోగంకొని డౌన్ పాసింజరు ఎక్కాడు. తర్వాత యథాసమయా నికి ఉత్తరపాడాలో దిగి కేనారాం ఆరామవాటికలో తిష్టవేశాడు.

* * *

జగ్గూకోచ్‌వాన్ స్వామిభక్తుడు. యజమానిని కొనిపోయినబండి డిస్టెంట్ సిగ్నల్ దాటగానే టాక్సీ ఎక్కి బాగ్ బజారువెళ్ళి బాబుగారు పిల్లాజల్లాతో మధురయాత్రకు పోయారని యజమానురాలితో

చెప్పాడు.

లవంగమంజరి చేతిలోంచి జిలేబిపొట్లం క్రింద పడి పోయింది. తెరుచుకున్న నోరు అలానేవుండిపోయింది. అనేకదుశ్చింతలు ఆమెను ఆవరించినవి. మధుర లోని పండాలు గుండాలని ఆమె నాయనమ్మ చిన్నప్పటి నుంచీ చెప్పుతూ వుండేది.

మంజరి వూహించసాగింది— పండావచ్చాడు... చిన్నమ్మాయికి మిఠాయి యిచ్చాడు...గొంతు పిసి కాడు... మొలలోనిగజ్జెలూ—మెడలోని హారమూ... పలాయనమూ...

మంజరి ఇక ఆలోచించ లేకపోయింది. కెవ్వున కేక వేసి, ఏడుస్తో అడిగింది—"నీవు ఎందుకు వెళ్ళ లేదూ వెంట?"

జగ్గూ అన్నాడు—"బాబుగారు తీసుకెళ్ళలేదు, ఏంచేసేదీ? లేకపోతే యీ ముసలితనంలో మధుర దర్శించటం—"

లవంగమంజరి తల్లి వచ్చి సమస్తమూ విని కుమా రుని పిలిచి అన్నది—"నీవు పోరా హరీ! ఉద్దండపు పిల్లలను పెట్టుకొని పరదేశంలో వొంటరికాదు—"

హరికి దేశాటనం చేయాలనే కోరిక మహావుంది. ధనాభావంచేత ఎక్కడకూ పోనిమాట మాత్రం యథార్థం—అయితే ఏం? భారతదేశంలో వుండే రైల్వేకంపెనీల టైంటేబిల్లన్నీ భట్టీపెట్టివుంచాడు. తల్లి గారి ప్రస్తావన వినగానే వుత్సాహంతో అన్నాడు—

"ఆఁ! వెళ్ళటం చాలా అవుసరం—"

"వారిని చూడగానే మాకు తంతి యివ్వు—జ్ఞాపకం వుంటుందా?" అని లవంగిమంజరి వంద రూపాయల మూట తీసుకువచ్చి హరికి యిచ్చింది.

హరి సూట్‌కేస్ చేతపట్టుకొని బజారుకు వచ్చి బస్ ఎక్కాడు.

వాకిట్లో బిచ్చగాడొకడు గీతం పాడుతున్నాడు.

'ఏల దుఃఖించెదే బేలరాధమ్మ
వెగటు వేసిందేమొ వ్రేపల్లె విడిచి
ముద్దుల కృష్ణుండు మధురకు తరలె
తిరిగి రాడమ్మరో తిరిగి రాడమ్మ!'

విని లవంగమంజరి కపించిపోయి అన్నది. "ఎంత కులక్షణ గీతం! జగ్గూ మూరంగా కొట్టు దరిద్రుణ్ణి!"

బిచ్చగాడు గొణుక్కొంటూ వెళ్ళిపోయాడు. కాని గీతంలోని అఖరు చరణం లవంగమంజరి హృదయంలో—సమ్మెట పెట్టువలె ప్రతిధ్వనించ సాగింది. చివరకు అధీరమై క్షేమీని వెంటపెట్టుకొని, కళ్ళనీళ్లు తుడుచుకొంటూ టాక్సీ ఎక్కి పతి గృహానికి బయలుదేరింది.

ఇంటికి వచ్చి చూచుకునే వరకు లవంగమంజరి దుశ్చింత త్రిగుణమైంది. బేచారాంబాబు ఉలెన్ ఫ్లానలు కోటు తీసుకువెళ్ళనేలేదు. పిల్లల నలభై జోళ్ళ పట్టు మేజోళ్ళూ వరండానిండా పడివున్నాయి. లవంగమంజరి ఏడుస్తూ క్షేమీతో అన్నది—"ఎంత

శాస్తి జరిగింది నాకు క్షేమీ? ఈ చలికాలంలో ఉన్న గుడ్డలన్నీ యిక్కడే వదిలెట్టి పోయారు."

క్షేమీ అంది—"మీ రేమీ దిగులుపడబోకండి. దగ్గర డబ్బుంది—కొనుక్కొంటారు!"

లవంగమంజరి— "అదేమి కలకత్తా పట్టణమా క్షేమీ—డబ్బు పారవేయగానే వస్తువు దొరక టానికి? కోపించినందుకు నేనెంత తాపపడు తున్నాను!"

లవంగమంజరి ఇక నిలబడలేక శయ్యమీద పోయి వాలింది—క్షేమీ ఆమె పాదాలు వత్తసాగింది.

*　　*　　*

బంగళాకు ఎదురుగా గంగ ప్రక్కన కూర్చుని బేచారాంబాబు తన జీవితం సింహావలోకనం చేసు కొంటున్నాడు—ఎంత నియమహీన దుఃఖమయ జీవ నము! ప్రాణాధికురాలైన పత్ని నేడు విముఖురా లైంది. పది సంవత్సరాల క్రితం వెన్నెల రాత్రిలో—ఈ గంగానదిలో—ఇక్కడే వాలలాడాము; స్వరంలో స్వరం కలిపి ప్రేమ గీతాలు పాడాము. ఇవ్వాళో—! పెద్దమ్మాయి వంటచేయటానికి పోతే పొయ్యిదగ్గరే నిద్రపోతుంది. పెద్దబ్బాయి వీలుచిక్కిందంటేచాలు—ఓఘ్రిత్రోటమాలి సహదేవుని పారా పలుగూ తీసుకు వెళ్ళి గంగలో కలుపుతాడు. రోజూ ఉదయం రెండ ణాల నాన్‌రొట్టె, కేసు మిఠాయీ లేకపోతే చిన్న

బ్బాయి చిరుతిండి అంటకు. చిన్నమ్మాయి మిణు గురు పురుగును చూడగానే కీచుమంటుంది. రాత్రింతా దోమల సంగీతం, కప్పల బెకబెకలకూ తెంపు వుండదు. సహదేవ తోటమాలి తన దేశంలో వున్న ప్రేయసిని తలచుకొని ఓఢ్రిభాషలో బిగ్గ రగా కలవరిస్తే బేచాబాబు ఉలిక్కిపడి లేస్తాడు. ఇలాంటి విచిత్ర ఉత్పాతాలవల్ల బేచారాం బాబు విసుకెత్తి పోయాడు. ఏకాకిజీవనం అతనికి ఎంతమా త్రమూ సహించటంలేదు. స్టీమరుఎక్కి ఒకమాటు సుందర వనంలోవున్న జమీందారీని చూచిరావాలను కున్నాడు. అక్కడి ప్రజలలో కొన్నాళ్ళు వుంటే కాస్త మనశ్శాంతి అయినా కలుగుతుందేమోనని అతని నమ్మకం. బాగా యోచించి ఈ సంకల్పాన్నే చాలాభాగం స్థిర పరచుకొంటూ వుండగా వెనుక నుంచి ఎవరో పిల్చారు—"ఎవరు? బేచారాంబాబు గారా? సమస్కారము!"

బేచారాంబాబు తిరిగి చూశాడు. తాల్‌తల్లాలో వుండే విపిన్ చౌధరి. వీరు పూర్వం సియాల్‌దహాలో టిక్కెట్టుకలెక్టరుగా వుండేవారు. పాత రిటర్న్ టిక్కెట్టు ఒక్కటి అమ్మినందుకు వీరి నౌకరి వూడింది. ఇప్పుడు వుత్తరపాడాలో గొడ్లను నున్నా తవుడూ కమీషను బేరంచేస్తున్నాడు. వీరిద్దరికీ ఇదివరకే పరి చయం వుంది. బేచారాంబాబు అన్నాడు—"ఆఁ!"

విపినబాబు అన్నాడు—"భలే, చాలాకాలానికి

కనపడ్డారు, ఉద్యానవాటికకు వచ్చారా! పరివారం తోటే?"

బేచారాంబాబు ఉదాసీన ముఖంతో అన్నాడు—"పరివారం లేదు."

విపినబాబు సానుభూతి చూపాడు—"ఇంటివారు లేరూ? ఇది నాకు తెలియనే తెలియదు! ఎంత దుఃఖవార్త."

బేచారాంబాబు వేదాంతి వలె గంభీరంగా అన్నాడు—"దుఃఖమెందుకు? ప్రపంచంలో సంయోగవియోగాలూ దినరాత్రులూ అన్నీ వున్నాయి. అన్నీ మనం సహించ వలసిందే."

విపినబాబు కాస్త ఒక గుటక వేసి అన్నాడు—"మీరు వేరుగా భావించకపోతే ఒక మనవి చేస్తాను. నాకొక మరదలువుంది. ఇరవై ఒకటో సంవత్సరం. రంగు మా ఆవిడమాదిరిగానే ఎరుపు. కాని కళ్లు అంత పెద్దవికావు. ఇక తతిమా విషయాల్లో—గ్రహించారు కదండీ—దేవకన్యక! బీదబ్రాహ్మణ్ణి. మీరు గనుక ఆజ్ఞాపిస్తే—"

బేచారాంబాబు గంగవైపు చూస్తూ, ఈదే టప్పటి, లవంగమంజరి శరీరచాంచల్యం స్మృతికి తెచ్చుకొని పులకిస్తూవున్నాడు. విపినుని మాటలు అతని చెవికెక్కలేదు. అన్యమనస్కంగా అన్నాడు—"చూద్దాము."

విపినుడు యింటికి తిరిగివచ్చి ముందు భార్యతూ,

తర్వాత అత్తకూ, పిమ్మట అతని మామ జలధర బాబుకూ తానొక పెద్దజంతువును వలలో వేసుకొచ్చానని చెప్పాడు. దీనితోపాటు తన మరదలు బృందరాణిని బుగ్గ గిల్లి కాస్త సరసం ఆడటం కూడా మరచిపోలేదు. బేచారాంబాబును రెండో సంబంధానికి యిస్తే పిల్ల ఎంత సుఖపడేదీ మహా రసవంతంగా వర్ణించి కన్యాభారంచే కాతరులై యున్న వృద్ధ దంపతుల అంతరాత్మలను పూరించాడు. వృద్ధ దంపతులు ఆరాత్రి నిద్రపోలేదు. ప్రొద్దు పొడవక ముందే జలధరబాబు భార్య, బేచారాంబాబు ఆస్తి పాసులు నమ్మకంగా కనుక్కురమ్మని, భర్తను కలకత్తా పంపించింది.

* * *

అనేక దినాలు హరి తంతియిస్తాడని, తంతిప్యూన్ కోసం ఎదురుచూస్తూ వుండటంవల్ల లవంగమంజరి కళ్ళలోని జ్యోతి తగ్గిపోయింది. బేచారాంబాబు మామగారు వెళ్ళిన నాటినుండే నిద్ర హరాయమయింది. హరి తంతిరానందుచేత ఆకలికూడా అడుగంటింది.

మంజరి ఎల్లప్పుడూ ఏడుస్తూ వుంటుంది. ఆరోజు కూడా మధ్యాహ్నం ఏడుస్తూ వుండగా బయట ఎవరో కేకవేశారు—"ఇది బేచారాంబాబు గారి యిల్లేనా?"

మంజరి నిద్రపోయే షేమీదాసీని, జుట్టుపట్టు

కొని లాగి, మేల్కొలిపి అంది—"క్షేమీ! చూడు, చెలిగ్రాం వచ్చినట్టుగా—"

క్షేమీ క్రిందికిపోయి వచ్చి అంది—"ఎవరో పెద్దమనిషి. వృద్ధుడు. తంతీగింతీ ఏమీ లేదు."

భర్తగారి కబురు ఏమైనా తెలుస్తుందేమోనని క్షేమీని వెంటపెట్టుకొని లవంగమంజరి క్రిందికి దిగి వచ్చింది. వృద్ధుని కూర్చోబెట్టి ప్రశ్నించింది—"తమరు ఎక్కడనుంచి దయచేశారు?"

జలధరబాబు జవాబిచ్చాడు—"ఉత్తరపాడానుంచి. ఇది బేచారాంబాబుగారి యిల్లేనా? పిత్రార్జితం?"

లవంగమంజరి అన్నది — "ఆఁ."

"దోవతప్పి కాశీఘాటు వెళ్లాను. ఇల్లు బాగానే వుంది!" అని జలధరబాబు అటూ ఇటూ సొలికలుగా అనేక ప్రశ్నలు వేసి—బేచారాంబాబు చేతిలో పిల్లను పెడితే—బృందరాణి నిజంగా రాణీ అవుతుందని గ్రహించాడు. తర్వాత వెళ్ళిపోయేముందు గొణుగుకొన్నాడు —"ఇక ముశిపడటమే మిగిలింది."

ఈమాట లవంగమంజరి విని అడిగింది—"ఏమిటి మీరు అన్నది?"

జలధరబాబు అన్నాడు — "అంటానికేముంది తల్లీ! పెళ్ళియీడుకు వచ్చిన పిల్ల ఒకటి నెత్తిమీద వుంది. మాఅల్లుడు విపిన్డు బేచారాంబాబు రెండో పెళ్ళి చేసుకొంటాడని చెప్పాడు."

క్షేమీ దాసినోరు అలానే తెరుచుకుపోయింది.

లవంగమంజరి జ్యోతిహీన నేత్రాలలో తిరిగి జ్యోతి వచ్చింది. ప్రశ్నించింది—"వారెక్కడ వున్నారు?"

"ఉత్తరపాడాలో"—అని పెళ్ళి అయినట్టుగానే భావించుకొని కన్య రాణీకాబోతున్న దన్న సంతోషంతో జలధరబాబు చేతికర్ర టకటక నేలమీద కొట్టుకొంటూ వెళ్ళిపోయాడు.

బేచారాం బాబు మధుర వెళ్ళాలనే మిషతో ఉత్తరపాడా వెళ్ళి చాటుగా పెళ్ళి చేసుకోవటానికి కుట్రపన్నుతున్నాడు! మంజరి బుర్ర కుతకుత ఉడక సాగింది. బేచారాంబాబు ఆదినుంచీ కుట్రదారుడుగానే కనుపించసాగాడు. అనేక విధాల యీమెను మెట్రిక్యులేషన్ పరీక్ష పాసు కానీయకుండా చేశాడు. నేటివరకు బేచారాంబాబు మంజరీలమధ్య జరిగిన వ్యవహారాల్లో కాస్తో కూస్తో వంచనా, కుట్రా, కపటమూ ఉన్నది. కర్తవ్య మేమిటో మంజరి ఏమాత్రమూ నిశ్చయించుకోలేకపోయింది.

క్షేమి అన్నది—"ఆలోచించి ఇంకా ఏంచేస్తారు? ఇంకేమీ మించిపోలేదు.మిమ్మల్ని చూడగానే—"

"వారు నాకక్ఖరలేదు ! నా పిల్లలు నాకు చాలు ! —మహాదేవ్!"

ఆజ్ఞానుసారము మహాదేవదర్వాను టాక్సీ పిలుచుకు వచ్చాడు.

*　*　*

చలికాలము. ప్రొద్దు క్రుంకుతూ వుంది. బంగాళాలో, బేచారాంబాబు శాలువా కప్పుకొని ఈజీ చైరు మీద పండుకొని వున్నాడు. ఎదురుగా ఒక కుర్చీ మీద విపిన్ చౌధరి కూర్చుని అంటున్నాడు—

"అదెట్లాగండి, సార్! వృథాగా ముసలివాడిచేత పద్ధాను గజాలు రైలు ఖర్చు పెట్టించి యిప్పుడు—"

బేచారాంబాబు—"పొరపాటున విని వుంటావు. నేను అలా చెప్పలేదు."

విపిన—"నేనండీ పొరపాటున వినేది? ఇన్నాళ్ళ నుంచీ కమీషను శేరం చేస్తూ బ్రతుకుతున్నాను—డోకరాలదగ్గరనుంచి జ్ఞాపకం వుంటుంది. నేను పొరపాటున వింటానూ! స్పష్టంగా చెప్పేసేయండి, వివాహం చేసుకుంటారా లేదా?"

బేచారాంబాబు కణతలు వత్తుకొంటూ అన్నాడు—"నన్ను వేధించబోకు మహాశయా! ఇలాంటి సంగతులు నాకు బాగావుండవు. నా భార్య జీవించే వుంది—కన్నవారింటివద్ద వుండటంవల్ల ఇంటివారు లేరని చెప్పాను. అసలు ఆవిడే లేకపోయినా రెండో పెళ్లి చేసుకోను, తెలుసునా? ఆవిడతో పద్ధానుగు సంవత్సరాల పరిచయం—ఆమెను వదలి ఇంకో అపరిచితను ఎట్లా పెళ్లాడతాను!"

విపినుడు—"స్త్రీలతో పరిచయం ఏమిటండీ? ఒక్కసారి పరిచయం అయితే అంతా గ్రహించవచ్చు! ఇదంతా మీరు చేసే మోసంలావుంది.

ఒక భార్య వుంటే ఏమయినట్టు? ఇంకో వివాహం చేసుకొని యిక్కడే వుంచిపొండి. తిండీ తిప్పలకూ డబ్బు పంపిస్తూ వుంటే చాలు."

బేచారాంబాబు కోపంతో అన్నాడు—"మీకే చెప్పేది. నా తల పగిలిపోతోంది. నే నిక మీతో మాట్లాడలేను."

ఇంతవరకూ తలుపు చాటున నిలబడి లవంగ మంజరి భర్తమాటలు వింటూ పశ్చాత్తాపముచే తపించిపోతోంది. ఇక తనను ఆవుకోలేక విపినుని ఎదుటకు వచ్చి నిలబడింది.

బేచారాంబాబు "అరే నీవా!" అని లేవటానికి ప్రయత్నించాడు. కాని మరల ఈజీ చైరులోనే పండుకొని కళ్లుమూశాడు. విపినుడు సంగతంతా గ్రహించి చప్పున దోవపుచ్చుకున్నాడు. పాపం, పదు నాలుగణాలు పనూలు చేయులేక పోయాడు. క్షేమా దాసివల్ల, తల్లి వచ్చిందని విని, పిల్లలు వస్తించిన పళ్లే లను అవతలపా రేసి పరుగెత్తుకొచ్చి ఏడుపు మొహంతో వున్న తల్లిని చుట్టుముట్టారు. మంజరి ఏడుస్తూ అంద రిని ఒక్కసారిగా కౌగలించుకొని పడకకుర్చీలో పండు కొనివున్న బేచారంబాబుగారి వెలవెల బోయిన పెద వులవంక సతృష్ణ నేత్రాలతో చూడసాగింది.

* * *

ఇద్దరి దృష్టులూ అనేకసారులు కలిసినై. కాని ముందు ఎవరు మాట్లాడేదీ స్థిరం చేసుకోలేకపో

యాను. పూరీలు వడ్డించే నెపంతో—ఇంకా రెండు వేస్తాను—అని సంభాషణ ప్రారంభిస్తే, కార్యం సాను కూలం అవుతుంది—మానహాని కూడా వుండ దని ఎంచి లవంగమంజరి పాకశాలలో ప్రవేశిం చింది... కొంచెం సేపట్లో పూరీలపళ్ళెం చేతపట్టుకు వచ్చి చూచింది— ఈజీచైరులో బేచారాంబాబు లేరు! ఆశంకతో మంజరి హృదయం దడదడా కొట్టుకొంది.

* * *

గంగ వొడ్డున బేచారాంబాబు నిశ్చింతగా కూర్చుని వున్నారు— ఇక ఏవిధమైన ఉత్పాతం లేదు— ఈ ప్రపంచం ఇక రసాతలానికి పోయినా వీరికి సంతో షమే. ఇలా ఆలోచించుకొంటూ వుండగా మృదు పదక్షేపంతో ఎవ్వరోవచ్చి వారి ప్రక్కనే చప్పుడు లేకుండా కూర్చున్నారు. ఓరకంటితో చూశారు— లవంగమంజరి. వారి దేహంలో విద్యుచ్ఛక్తి ప్రవ హించింది. అయినా బేచారాంబాబు నోటమాటలేదు! మంజరి వొంటిమీద షిమీజ్‌గానీ బ్లౌజ్‌గానీ లేదు, అలానే నిశ్శబ్దంగా కూర్చుని పుష్యమాసపు చలిలో గడగడ వణకసాగింది. బేచారాంబాబు కనుగొలకు లతో అర్ధాంగి అవస్థ చూచి తన శాలువా కొంచెం ఎత్తారు కంపిస్తూ వున్న లవంగమంజరి శరీరం అందు లోకి వచ్చింది. తర్వాత వారి ఎడమ భుజం మీద మంజరి తలా కుడి భుజం మీద మంజరి చెయ్యీ,

ఆటంకాలేమీ లేకుండానే చోటు చేసుకున్నవి.

అప్పుడు గంగలో వెల్లువ బాగా వచ్చివుంది. ప్రవాహానికి వాలుగా నావను వదలి చాలామంది నావికులు బిగ్గరగా కోరస్ పాడుతున్నారు.

జాగర్త నావికా జాగర్తరో!
ప్రణయవాహినిలోన వెల్లువా తన్నింది,
ఎటు చూచినా సుళ్ళు దూరంబు పోవాలి,
పడవ ఘట్టిదికాదు భద్రంబురా అబ్బి,
ఎటుల చేరుస్తావో ఎరుగలేకున్నాము,
జాగర్త నావికా జాగర్తరో!

విని వొడ్డున వున్న మాన ప్రాణు లిద్దరు మంద హాసం చేశారు. నోటివెంట శబ్దం కూడా వచ్చింది. ఒకరు అశ్రుగద్గద కంఠంతో పిలిచారు—"లవంగ్!"

రెండోవారు వెక్కిళ్ళతో జవా బిచ్చారు—"బేచారో!"

# సంస్కారి.

నేటినుండి—

(క) నిమ్న జాతులసేవ చేయడమే నాజీవనోద్దేశము.

(ఖ) వారల సామాజిక ఉన్నతి కొరకై పాటు పడటమే నాజీవిత లక్ష్యము.

(గ) వితంతువుల దుఃఖవిమోచనమే నా జీవన వ్రతము.

భగవంతుడు నాకు సహాయము చేయుగాక!

ఈ నాలుగు ముక్కలూ బిగ్గరగా చదివి శ్రీయుత అనాదిచరణ చక్రవర్తి బి. ఏ. నిర్లక్ష్యముగా సంతకం చేసాడు. తండ్రి స్వర్గీయ శ్యామచరణ చక్రవర్తి. సాకిన్ పదమీ—జిల్లా జస్సోర్.

కళ్ళజోడు ముక్కుకొనవరకు లాగి సమాజ సంస్కార సమితి వృద్ధ అధ్యక్షుడు అన్నాడు—"నేడు గ్రహించిన వ్రతాన్ని ఉద్యాపన చేయగలిగితే, మీ జీవితము సార్థక మవుతుంది. మీరు ఎప్పుడు బయలు దేరబోతున్నారు?"

"ఇవ్వాళే. ఇక ఆలస్యం చేయను. మన జాతి దుర్దశ చూస్తూ, యింకా ఓర్పు వహించివుంటం నాబోటివారిపట్ల అసంభం!"

"హమ్మ. నీజీవితము మీరందరికీ ఆదర్శముగా ఉండు గాక!" అని అధ్యక్షమహాశయుడు అక్కడ కూర్చొని

వున్న ఇతర యువకులవంక చూశాడు.

అనాది నమస్కారం చేసి బయటకు వచ్చాడు.

ఆరోజులలో సమాజ సంస్కారంకోసం పట్టణ మంతటా పుట్టకొక్కుల వలె సంఘాలు పుట్టుతున్నాయి. ఇలాటి ఒక సంఘానికి చెందిన కార్యకర్త ప్రచారక పదవులు చిరంజీవి అనాదిచరణ చక్రవర్తి స్వీకరించాడు. క్రిందటిరోజున కాలేజీ స్క్వేయర్‌లో అధ్యక్షమహాశయుని గంభీరోపన్యాసము విని అనాది మనస్సులో జాతిసేవ చేయాలనే భావం ఎగతన్నింది. అదే నేడు ఈపదవీగ్రహణరూపంగా బయటపడింది!

మెస్‌కు తిరిగివచ్చాక అనాదిమిత్రులను పిలిచి అన్నాడు—"నాజీవిత స్వప్నాలను సఫలం చేసుకోటానికి నేను వీలు చిక్కించుకొన్నాను; నేను కర్మపథములో నడవబోతున్నాను. మీరుకూడా నన్ను అనుసరించండి."

తర్వాత యివ్వాళ సాయంత్రం సంఘటిల్లిన ఘటనలన్నీ వివరంగా మిత్రులకు వినిపించాడు.

మిత్రులందరు ఏకగ్రీవంగా అన్నారు—"భలే, నీవు చాలా మంచిపని చేశావోయి! నీవు తప్పకుండా ఆమార్గాన్నే నడువు!"

ఒకరిద్దరు మిత్రులు లాఘవకీశ పూర్తిచేశాక వారి మార్గమే అనుసరిస్తామని వాగ్దానంకూడా చేశారు.

అనాది నౌకరు హరిచరణుని పిలిచి టీ తీసుకు రమ్మని ఆజ్ఞాపించాడు. నౌకరు సగంమెట్లు దిగాక

